Phone : 27354 Regd. No. HNL. 18

17.6.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 65, సంచిక: 24, విడిప్రతి: రు. 2.00 లు

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



# ప్రధాని ముందే సిగపట్లు!

ముఖ్యమంత్రి అనుకూల, ప్రతికూల వర్గాల మధ్య వున్న చిచ్చు ప్రధాని సమక్షంలోనే సిగపట్లకు దారితీసింది. ఏఐసిసి సమావేశాల సందర్భంగా ప్రధాని మన రాష్ట్రానికి చెందిన ఎమ్మెల్యేలు, ఎంపీలు, ఏఐసిసి సభ్యులు, మంత్రులు, ఇతర చిన్నా చితకా నాయకులలో సమావేశమయ్యారు. కర్నూలు ఉపఎన్నిక నేపథ్యంలో జరిగిన ఈ సమావేశానికి ముఖ్యమంత్రి తన తరఫున వాదన వినిపించేందుకు బలగాన్ని మోహరించారు. అయితే అసమ్మతి కేంద్ర బిందువైన వై.ఎస్. మాత్రం ఎందుకనో తమ వర్గీయుల నోళ్లు మూయించారు. ఒక్క హనుమంత రావు మాత్రం బయటడ పడి ముఖ్యమంత్రి వైఖరిని, రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ పరిస్థితిని తీవ్రంగా దుయ్యబట్టారు. ముఖ్యమంత్రి తరఫున చీఫ్ విప్ నన్నపనేని రాజకుమారి అసమ్మతీయుల పై వీరంగం చేసింది. కర్నూలు ఎన్నికలో ముఖ్యమంత్రి కుమారుడ్ని ఓడించేందుకు వై.ఎస్. రాజశేఖర రెడ్డి మందీ మార్బలాన్ని అందించారని, తెలుగుదేశం అభ్యర్థి కోసం వై.ఎస్. పంపిన జీపుల రిజిష్ట్రేషన్ నెంబర్లు తన దగ్గర వున్నాయని నన్నపనేని విమర్శించారు. అలాగే మాజీ ముఖ్యమంత్రి జలగం వెంగళ రావు కాంగ్రెస్ పార్టీ పై, ముఖ్యమంత్రి పై చేసిన విమర్శలు తెలుగుదేశం పార్టీకి అస్త్రాలుగా ఉపయోగ పడ్తున్నాయని ఆమె ఆరోపించారు. ఎప్పటి మాదిరిగానే ఎమ్మెల్యే కోదండ రెడ్డి ముఖ్యమంత్రిని స్తుతించడానికి తన దండకాన్ని అన్ చేశాడు. విన్నటి దాకా ముఖ్యమంత్రిని తెగ తిట్టి పోసిన మాజీ మంత్రి మహమ్మద్ జానీ ముఖ్యమంత్రి తరఫున వకాల్తా తీసుకొని వాదించడం అందర్నీ ఆశ్చర్య పరచింది. ఒక్క రోశయ్య మాత్రం వాస్తవ పరిస్థితిని వివరించారు. రాష్ట్రంలో తెలుగుదేశం పరిస్థితి కూడా బాగోలేదు. అలాగని కాంగ్రెస్ పరిస్థితి బాగుందని కాదు. కాంగ్రెస్‌లో ఎవరికి వారే అన్నట్లు వ్యవహరిస్తున్నారు. వీరందర్నీ కలుపుకొని ఒకే తాటి మీద నడపాల్సిన బాధ్యత ముఖ్యమంత్రి మీద వుంది. రాష్ట్రంలో విడివిడిగా వుంటున్న మూలవిరాట్టులు కలిసి కట్టుగా పనిచేస్తే తిరిగి కాంగ్రెస్ విజయం తథ్యం అని రోశయ్య నిర్మాణాత్మకంగా పి.వి.కి వివరించారు. నెల్లూరు జిల్లాకు చెందిన మాజీ ఎమ్మెల్సీ మాదాసు గంగాధరం కొత్తగా కాపు నాయకుడై నట్లున్నాడు. కాపుల్ని బిసిలలో చేర్చాల్సిందిగా ప్రధానిని కోరారు. మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి కూడా ఈ సమావేశానికి హాజరై మౌన ప్రేక్షకుడిలా చూస్తుండి పోయారు. వై.ఎస్. మాత్రం సమావేశానికి రాలేదు. ఆయన

కొరవ 7 వ పేజీలో

## ఇద్దరు ఉపముఖ్యమంత్రులు

రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీని బ్రతికించడానికి పివి నరసింహారావు గారు తలపెడుతున్న చర్యలలో భాగంగా, ఇద్దరు ఉపముఖ్యమంత్రులను క్యాబినెట్‌లోకి తీసుకోమని విజయభాస్కర రెడ్డిని ఆదేశించ నున్నారని విశ్వసనీయ వార్త. ఒక హరిజనుడికి, ఒక వెనుకబడిన తరగతుల నాయకుడికి ఈ అదృష్టం పట్టవచ్చు. ప్రధాని శ్రీ పివి ఇటు విజయభాస్కర రెడ్డి పైన, అటు వైఎస్ రాజశేఖర రెడ్డి పైన కూడా ఆగ్రహంతో వున్నట్లు ఢిల్లీ నుంచి వార్తలందుతున్నాయి!

# ఎన్టీఆర్ కాళ్లు నేల మీద ఆనడం లేదు!

బ్రహ్మర్షి విశ్వామిత్రుడు త్రిశంకు స్వర్గం సృష్టించుకొని మురిసిపోతే ఎన్నికలు కాకముందే తనపార్టీ విజయం ఊహించుకుంటున్న ఎన్టీ రామారావు భవిష్యత్ మంత్రిమండలిని ఏర్పాటు చేసుకొని తెగ ఆనందపడి పోతున్నాడు. ముప్పయ్ ఆరుమందికి మంత్రి పదవులిచ్చి, వారికి శాఖలు కూడా కేటాయించుకున్నారు. విచిత్రం ఏమిటంటే ఇందులో ఇద్దరల్లుళ్ల పేర్లు లేవట.

కర్నూలు ఉప ఎన్నిక తర్వాత ఎన్టీఆర్ భూమ్మీద నిలబడటం లేదు. తాను ముఖ్యమంత్రి అయినట్లే భావిస్తున్నాడు. ఎన్నికకు ముందు ఎన్టీఆర్ ప్రవర్తన ప్రతిపక్ష నాయకుడి హోదాకు పరిమితం కాగా ఎన్నిక తర్వాత ముఖ్యమంత్రి అయినట్లే ఫోజు పెట్టడం తెలుగుదేశం వర్గాల్లో కలవరం కలిగిస్తోంది. ఆలూ చూలూ లేకపోయినా కన్నబిడ్డకు పేరు పెట్టినట్లు ఎన్నికలు జరక్కుండానే అధికారం చేజిక్కించుకున్నట్లు వ్యవహరించడం అల్లుళ్లకు కూడా కంపరం కలిగిస్తోంది.

**కర్నూలు ఉపఎన్నిక తర్వాత తాను ముఖ్యమంత్రి అయినట్లే ఫీలై పోతున్నాడు!**

బంజారాహిల్స్‌లో నిర్మాణంలో వున్న ఇంట్లో పార్టీ సెక్రటేరియట్ పెడదామని ఎన్టీఆర్ అనుకున్నారు. అయితే ఆ ఇంటి వ్యవహారం కోర్టులో వుండటంతో హిమాయత్ నగర్‌లోని పార్టీ నగరశాఖ కార్యాలయంలోనే పార్టీ సెక్రటేరియట్‌ను ఏర్పాటు చేశారు.

రాష్ట్ర ప్రభుత్వ సెక్రటేరియట్ మాదిరిగానే ఈ సెక్రటేరియట్ పని చేస్తుందట. సెక్రటేరియట్‌లో వివిధ శాఖల కార్యదర్శుల మాదిరిగా కొందరు రిటైర్డ్‌అధికారులను నియమించుకున్నాడు. మంత్రిమండలి మాదిరిగా సలహా మండలిని ఏర్పాటు చేసుకొని, తమ ప్రభుత్వం చేపట్టే వివిధ అభివృద్ధి కార్యక్రమాల ప్రాధాన్యతను నిర్ణయిస్తున్నారు. ఎన్టీఆర్ సెక్రటేరియట్‌లో చక్రం తిప్పే చంద్రబాబు కానీ, పెద్దపీట వేసుకొన్న వెంకటేశ్వర రావుగానీ లేకపోవటం గమనార్హం.

## ఎన్టీఆర్ 'యమ'జోరు

కర్నూలులో తెపన్ పై పెట్టుకున్న ఆశలు వమ్మయినా కాంగ్రెస్‌కు పెద్దగా మెజారిటీ రాకపోవడం గుడ్డిలో మెల్లలాగా వుందని తెలుగు దేశం పార్టీ అధ్యక్షుడు ఎన్టీరామారావు 'యమ' ఆనంద పడిపోతున్నారు. అసలు కర్నూలులో దేశం పోటీలో లేకుండా పోతుందను కున్నారు. అటువంటిది అన్ని లక్షల ఓట్లు పోలుకావడం ఎన్టీఆర్‌ను ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఇంకేముంది -ఇదంతా తన బలమేనని ఆయన మురిసిపోతున్నాడు. నిజానికి కర్నూలు జిల్లాలో ముఖ్యమంత్రికి, ఆయన వంశ పాలన, ఫ్యూడల్ తత్వానికి వ్యతిరేకంగా జనం ఓట్లు వేశారు. మిత్రపక్షాల వాళ్లు కష్టపడి ఓటర్లను పోలింగ్ కేంద్రాల వద్దకు తీసుకురాగలిగారు. అంతేకాని కర్నూలులో తెలుగుదేశం 'గాలి' ఏమీ లేదు. కానీ ఎన్టీఆర్‌కు మాత్రం ఇటువంటి సత్యాలు రుచించడం లేదు. కర్నూలు క్యాంపు నడిపిన చంద్రబాబు నాయుడు "వాస్తవ పరిస్థితి" గురించి రామారావుకు వివరించినా చెవిటి వాడి ముందు శంఖు ఊదినట్లుంది. కర్నూలు ఎన్నికల ప్రచారంలో చంద్రబాబు జాగ్రత్త పడి లక్ష్మీపార్వతి ప్రమేయాన్ని తగ్గించాడు. బహిరంగ సభలో మాట్లాడకుండా లక్ష్మీపార్వతిని కారులోనే కూర్చుండేట్లుచేశాడు. ఒక్క కర్నూలు సభలో మాత్రం రామారావు బలవంతం మీద లక్ష్మీపార్వతి వేదిక ఎక్క గలిగింది. తన ముద్దుల పెళ్ళాం పట్ల చంద్రబాబు అసూయ పెంచుకున్నాడని రామారావు కోపంగా వున్నాడు.

అందుకే పార్టీ వ్యవహారాలకు చిన్నల్లుడ్ని దూరంగా పెడుతున్నాడు. కర్నూలులో బలం వుందని గుడ్డిగా నమ్మి వచ్చే ఎన్నికల్లో టిక్కెట్ల పంపిణీకి తిరిగి అంగడి తెరిచాడు. బాగా డబ్బున్న అభ్యర్థులకు మాత్రమే

* చేతిలో చిత్రగుప్తుడి చిట్టా
* కారణ జన్ముడనే భజన కార్యక్రమం
* అల్లుళ్లిద్దరూ ఆమడ దూరంలో!
* డబ్బున్న వారికే అసెంబ్లీ టికెట్లు

దరఖాస్తు ఫారాలు ఉచితంగా ఇస్తున్నారు. అయితే దరఖాస్తుతో పాటు పార్టీ పట్ల "విధేయత" చూపించడానికి ఖరీదైన 'డిమాండ్ డ్రాఫ్టులు' సమర్పించుకోవాల్సి వస్తోందని నయా తమ్ముళ్లు గగ్గోలు పెడుతున్నారు. పాత తమ్ముళ్ల పరిస్థితి సరేసరి. గతంలో 70 మందికి టిక్కెట్లు ఇస్తానని ' ఇప్పుడు మాట మార్చి సగం మందికి టిక్కెట్లు ఎగ్గొట్టేందుకు రంగం సిద్ధంచేశాడు.

ఇక్కడ ఒక్క మాట చెప్పాలి . కర్నూలులో తెలుగుదేశం గెలవాలని కోరుకున్న వాళ్లకంటే ఓడిపోవాలని కోరుకున్న 'తమ్ముళ్లే' ఎక్కువమంది ఉన్నారు.

తెలుగు దేశం గెలిస్తే రామారావుకు పట్టు పగ్గాలు ఉండవన్న సంగతి తెలుగు దేశంలో అక్షరాభ్యాసం చేస్తున్న వారికి సైతం తెలుసు. కానీ ఓడిపోయి కూడా మెజారిటీ తక్కువగా వచ్చిందని ఎన్టీఆర్ తన విశ్వరూపం చూపించడంతో తమ్ముళ్లంతా ఖంగు తిన్నారు.

### పార్వతి పట్టు బిగుస్తోంది

ఎన్టీఆర్‌లో వచ్చిన ఈ అనూహ్యమైన మార్పుకు ఆయన అర్ధాంగి లక్ష్మీపార్వతి కారణమని అందరూ అంగీకరిస్తున్నారు. ఎన్టీఆర్ జీవిత చరిత్ర రచయిత్రిగా ఎన్టీఆర్ కారణ జన్ముడని, దైవాంశ సంభూతుడని లక్ష్మి పార్వతి సిద్ధాంతీకరించింది. నిజ జీవితంలో కూడా ఎన్టీఆర్‌ను ప్రత్యేకమైన వ్యక్తిగా, అతీంద్రియ శక్తిగా పొగుడుతూ రామారావులోని అహాన్ని రెచ్చగొడ్తోందని, దాంతో ఎన్టీఆర్ ఏం చేస్తున్నారో ఆయనకే అర్థం కావటం లేదని పార్టీ వర్గాలంటున్నాయి. రామారావు బలహీనతపై దెబ్బతీసిన పార్వతి క్రమంగా పార్టీలో కూడా పట్టు సంపాదిస్తోంది. పన్నెండేళ్లుగా తెలుగుదేశం పార్టీకి ఊడిగం చేస్తున్న అల్లుళ్లతో సహా పార్టీలోని పాత కాపుల తోకలు కత్తిరించాలని ఎన్టీఆర్ నిర్ణయించడం వెనక కూడా పార్వతి నిర్ణయాత్మక పాత్ర వుంది. "పార్టీలో ఎన్టీఆర్ ఒక్కరే సుప్రిమ్ - అల్లుళ్లూ గిల్లుళ్లూ జాన్తా నై" అన్న లక్ష్మీపార్వతి స్లోగన్ రామారావుకు కిక్కు ఇచ్చినట్లుంది. పార్టీ పరంగా ఏర్పాటయ్యే కమిటీల్లో అల్లుళ్లను,

తరువాయి 11 వ పేజీలో

# అభాసుపాలు

ప్రధాన ఎన్నికల కమీషనర్ శ్రీ టిఎన్ శేషన్ తోక కత్తిరించడానికి ప్రధాని శ్రీ పివి చేసిన మరొక ప్రయత్నమూ విఫలమైంది. రాజ్యాంగం ద్వారా తనకు సంక్రమించిన విస్తృతాధికారాలను విచక్షణా రహితంగా వినియోగిస్తూ, ప్రజాస్వామ్య ఎన్నికల ప్రక్రియలో వ్యక్తిగత నియంతృత్వాన్ని చలాయిస్తున్న శేషన్ కేంద్ర ప్రభుత్వానికి ఎప్పటికీ కొరకరాని కొయ్యగానే మిగిలిపోయాడు.

ఎన్నికల కమీషన్ వ్యవస్థను సంస్కరించి, త్రిసభ్య సంఘాన్ని నియమించాలని, తద్వారా శేషన్ సమస్యే కాకుండా, భవిష్యత్‌లో మరే కమీషనరూ విశృంఖలత్వంతో వ్యవహరించకుండా నిరోధించాలని ప్రధాని శ్రీ పివి 83 వ రాజ్యాంగ సవరణ బిల్లు రూపొందించారు. ఇందుకోసం పార్లమెంట్‌ను ప్రత్యేకంగా సమావేశ పరచారు. అయితే కాంగ్రెస్‌కు రాజ్యాంగ సవరణ కవసరమైన రెండింట మూడు వంతుల మెజారిటీ లేదు. సిపిఎం, సిపిఐ వంటి ప్రతి పక్షాలు కూడా శేషన్‌పై గుర్రుగా వుండడంతో వారి మద్దతు లభిస్తుందన్న విశ్వాసం ప్రభుత్వానికి ధైర్యం కల్పించింది.

అయితే తీరా పార్లమెంట్ సమావేశమై, బిల్లు ప్రవేశ పెట్టబోయే సమయంలో సిపిఐ నాయకులు మడత పేచీ పెట్టారు. ముగ్గురు ఎన్నికల కమీషనర్ల నియామకం ప్రభుత్వం చేతిలో వుండకూడదని సిపిఐ మొదట అభ్యంతరం చెప్పింది. దానికి పివి సమ్మతించి, సుప్రీంకోర్టు సలహాపైనే నియామకం జరపాలన్న నిర్దేశం బిల్లులో పొందుపరచడానికి అంగీకరించారు. కాని చివరి నిమిషంలో మళ్లీ సిపిఐ నాయకులు, ప్రధాన ఎన్నికల కమీషనర్‌కు త్రిసభ్య సంఘంలోని మిగతా ఇద్దరు సభ్యులపై ఆధిపత్యం, అధికారం వుండాలని పట్టుబట్టారు. ఇది పివికి నచ్చలేదు. ముగ్గురు సభ్యులకీ ఒకే అధికారాలుండాలని, వివాదం వచ్చినప్పుడు ఇద్దరేమి చెప్తే ఆ మెజారిటీ నిర్ణయం అమలు కావాలని ప్రభుత్వం వాదించింది. రాజీ కుదరలేదు. ఛీఫ్ కమీషనర్‌కు పెత్తనం ఇచ్చే పక్షంలో ఇక ఈ రాజ్యాంగ సవరణకే అర్థం లేదని భావించి సిపిఐ ప్రతిపాదనలను తిరస్కరించారు.

సిపిఎం, జనతాదళ్, ఎఐఎడిఎంకె వంటి పార్టీల మద్దతు వల్ల లోక్‌సభలో రెండింట మూడు వంతుల మెజారిటీ వున్నప్పటికీ, రాజ్య సభలో సంతృప్తికరమైన ఆధిక్యత కన్పించలేదు. బిల్లు పాస్ చేయడానికి 160 ఓట్లు కావలసి వుంటే, అందరికీ కలిసి 161 మాత్రమే వుండినాయి. ఒక్క ఓటు తేడాతో రిస్క్ చేయలేక బిల్లునే ఉపసంహరించుకున్నది ప్రభుత్వం. మొదటి నుంచీ ఈ సవరణలను వ్యతిరేకిస్తున్న బిజెపి విజయ గర్వంతో ప్రభుత్వాన్ని హేళన చేస్తున్నది. వారి సంతోషానికి కారణం వుంది. రాజకీయాల నుంచి మతాన్ని వేరు చేయడానికి ఉద్దేశించిన ప్రజాప్రాతినిధ్య సవరణ బిల్లును సైతం ప్రభుత్వం ఉపసంహరించింది. ఈ బిల్లు చట్టమైతే, మతాన్ని వాడుకునే పార్టీలు, మతపరమైన చిహ్నాలు, పేర్లు వాడుకొనే పార్టీల గుర్తింపు రద్దు చేసే వీలు కల్గుతుంది. ఇవి రెండూ బిజెపి, ముస్లింలీగ్ వంటి పార్టీలకు ప్రాణాంతకాలు. అందువల్లే వారు దాన్ని వ్యతిరేకిస్తున్నారు.

సరైన మద్దతు సమీకరించుకోకుండా, మితిమీరిన ఆత్మవిశ్వాసంతో వ్యవహరించి కేంద్ర ప్రభుత్వం తాను నవ్వుల పాలు కావడమే కాక, పార్లమెంట్‌నూ అభాసుపాలు జేసింది. ప్రధాని పివికి వ్యక్తిగత అవమానం ఇది. సమావేశాలకు ముందుగానే అన్ని పార్టీలతో చర్చలు జరిపి ఏకాభిప్రాయం సాధించి వుంటే బిల్లులు ఖచ్చితంగా పార్లమెంట్ ఆమోదం పొంది వుండేవి.

అవినీతి, మితిమీరిన రాజకీయ జోక్యం, అధికారుల ప్రమేయం, రౌడీఇజం, రిగ్గింగ్, డబ్బు పందారం, విచ్చలవిడి ఖర్చు, దొంగ ఓట్ల పోలింగు వంటి సవాలక్ష అవలక్షణాలతో భ్రష్టు పట్టి పోతున్న ఎన్నికల ప్రక్రియను తిరిగి పట్టాల పై నెట్టడానికి టిఎన్ శేషన్ చేస్తున్న కృషి ప్రశంస నీయమైనప్పటికీ, కేవలం ఒకే వ్యక్తి నియంతృత్వ పోకడల పై మొత్తం ప్రజాస్వామ్య వ్యవస్థ ఆధార పడడం ప్రమాదకరం. ఒక్కొక్కసారి శేషన్ చేస్తున్న నిర్ణయాలు, ప్రవర్తిస్తున్న తీరు ఎన్నికల యంత్రాంగాన్ని చిందర వందర జేస్తున్నాయి. ఈ విచ్చలవిడిని, విశృంఖలత్వాన్ని కొనసాగిస్తే చాలా విపరిణామాలు సంభవిస్తాయి. ఎన్నికలు సక్రమంగా జరగడం ఎంత అవసరమో, నియంత్రణ పేరుతో నియంతృత్వం చలామణీ కావడమూ అంతే ప్రమాదకరం. శేషన్ నిజాయితీ పరుడు, నిష్కళంకుడు కావచ్చు. కాని అదే పదవి రేపు మరొక సందేహాస్పద వ్యక్తిత్వం కల్గిన అధికారి హస్తగతమైతే పరిణామా లెంత దారుణంగా వుంటాయో వూహించ గలమా? ఈ కోణంలో నుంచి చూసినప్పుడు, ఇంత పెద్ద ప్రజాస్వామిక వ్యవస్థను ఒక్క వ్యక్తి ఇష్టా ఇష్టాలకు వదలకుండా, ఒక సంస్థ నియంత్రణ ఏర్పర్చడం సముచితం అవుతుంది. అందులోనూ ఎన్నికల కమీషన్ సభ్యులను సుప్రీం కోర్టు సంప్రదింపులతో నియమించాలనే నిర్ణయం జరిగింది కాబట్టి, నియామకాలు చాలా వరకు న్యాయ బద్ధంగా జరిగే అవకాశం వుంది. బిల్లు వెనక్కు పోవడం వల్ల ఇప్పటి చట్టం ప్రకారం ఎన్నికల కమీషనర్ నియామకం ప్రభుత్వ దయాధర్మాల పై ఆధార పడుతుంది.

ప్రధాని శ్రీ పివి ఇప్పటికైనా కలదెలుసుకొని, వాస్తవ పరిస్థితి గుర్తెరిగి, ప్రతిపక్షాలతో సంప్రదించి సమగ్రమైన, సర్వామోద కరమైన రాజ్యాంగ సవరణను ప్రతిపాదించాలి. ఎన్నికల కమీషన్ సంస్కరణతో పాటు, రాజకీయాల నుంచి మతాన్ని, ధనాన్ని వేరు చేసే బిల్లును ఆమోదింప జేయాలి!

# ఎల్లకాలం ఒకరి కర్రపెత్తనం సాగదు!

గతవారం 'జనవాణి' శీర్షికలో పి.వి. రమణయ్య గారు రాసిన లేఖ చాలా బాగుంది. అయితే ఆయన కొన్ని విషయాలు మర్చిపోయారు. జిల్లాలోని ఇతర అన్ని నియమిత పదవులు కూడా ఒకే కులంవారు తన్నుక పోతున్నారు. ఎలక్టెడ్ పోస్టులలో రానివ్వరు. నామినేటెడ్ పోస్టులలో నైనా వెనుకబడిన కులాల వారిని నియమిస్తే ఈ గొడవ వుండదు. బిసిల్లోనూ సామాన్యులు నాయకులుగా ఎదగలేక పోతున్నారు. డబ్బున్న వాళ్లే ఈ మధ్య మీటింగులు ఏర్పాటు చేస్తున్నారు. ప్రస్తుతం అందరినీ కూడకట్టుకొని పోయేవాడే నాయకునిగా రాణించగలడు. ఎల్లకాలం ఒకరి కర్ర పెత్తనం సాగే రోజులు కావివి.

నెల్లూరు - టి.వి.నారాయణ

## స్టేషన్ మాస్టర్ నిర్లక్ష్యం

9 తేది మా పిల్లలు సికింద్రాబాద్ పోయేందుకు నారాయణాద్రి రెండవ క్లాసులో టిక్కెట్లు రిజర్వు చేసుకొన్నారు. టిక్కెట్లపై రాసి వున్నట్లు ఎస్ -4 బోగి నిలబడే స్థలం అంటూ రాసి వుండిన చోటులో లగేజీతో సహా వేచి వుండినారు. కాని ట్రైన్ వచ్చి ఆగినపుడు ఆ స్థలంలో ఎస్-11 బోగి ఎదురుగా వుండింది. రైలు కొసన వుండిన ఎస్-4 బోగి చేరను పడరాని పాట్లు పడ్డారు పిల్లలు. టిసి గారిని ఈ విషయమై ప్రశ్నిస్తే ట్రైన్‌లో బోగీల మార్పుల విషయం ముందుగానే స్టేషన్ మాస్టర్‌కి లిఖిత పూర్వకంగా తెలిపినట్లు చెప్పారాయన. ఆ విషయాన్ని స్టేషన్ మాస్టర్! 'అనౌన్స్' చేయించలేదు. మూడుసార్లు ఇటువంటి అనుభవం మాకే కల్గింది. ఎస్-4 బోగి ఎక్కేందుకు పరుగు పందెంలో ఒక పెద్దాయన పడిపోవడం కూడా జరిగింది ఆ రోజు. స్టేషన్ మాస్టర్ ఈ తప్పు పునరావృతం కాకుండా చూడాలి.

- కె.ఎల్.కె. శర్మ

నాగమాంబాపురం

**జనవాణి**

## నపుంసకత్వం సమస్యే కాదు!

లైంగిక సమస్యలకు గురైన పురుషులను నపుంసకులుగా పరిగణించడం సర్వ సామాన్యం. పురుషుడు యీ భావనకు లోనైనపుడు మానసికంగా కృంగి పోవడం అతి సహజం. నపుంసకుడనే అనుమానానికి గురి చేసి యే పురుషుడినైనా భయపెట్టవచ్చు. ఈ భయాన్ని ఆధారం చేసుకొని కొన్ని కంపెనీలు 'వ్యర్థమైన మందులను' తయారు చేసి కోట్లు గడిస్తున్నాయి. కానీ వాస్తవంగా పరిశీలిస్తే స్త్రీ, పురుష లిరువురికీ సెక్స్ సైకాలజీలో సరైన అవగాహన లేనందున వాళ్లకు తెలియకనే జరిగే పొరబాట్లు లైంగిక సమస్యలకు ప్రధాన

కొరవ 12 వ పేజీలో

**50 ఏళ్ళ క్రితం ఈవారం**

16- 6 - 1944

పేజీలు : 6 వెల : 0-1-6

## నెల్లూరు ముచ్చట్లు

జనుప బండి పట్టాలు ఒక పెద్ద రైతు రెండు బతలు కంట్రోలు రేటుక అంటే బత రు25 లుగు తీసుకపో... బత రు90లు వంతున కనుపర్తి పాడు ... అమ్మినట్లు ఒక వ్యక్తి చెప్పారు. ... పేరు ... సందేహిస్తున్నారు. పేరు తెలిపినం... చెప్పు మాత్రం ఏం లాభం?

... దరఖాస్తుదారుడైన తన్ను దాటి వెనక దరఖాస్తుదారుడైన రెడ్డిగారి కొత్త బంధువు వదాన్య రాజశ్రీ దామరపు రంగారెడ్డిగారికి యిచ్చారని కట్టంరెడ్డి వెంకట నర్సారెడ్డిగారు చెప్పుతున్నారు. ... వేసెవాళ్లెగావి పేద రైతాంగానికి ఏమాత్రం ముట్టడం లేదు. అసలి పద్ధతే బాగులేదు. తాలూకాలకుపంపి రెవెన్యూ అధికార్ల ద్వారా అన్ని గ్రామాలకు దామాషా ప్రకారం పంచితే తప్ప దీనివల్ల లాభంలేదు.

* * *

పశువుల డాక్టరు అదరంతో ... సరిగ్గా వుండదని. ... నుంచి ... నిమిత్తం ... దినం ... కంప్లెంటు చేస్తున్నారు. ఏమిటి డాక్టరుగారూ!

... మునుబూరు సుందరామిరెడ్డి ...

## బజారు ధరలు:

- మొలగొలుకులు పుట్టి 1కి 142-0-0; వెంబర్లు రు145లు; రాగులు 175; ... రు 210 లు. ... 9-4-0 ... రు14-0-0; బంగారం మద్రాసు 1కి 51-6-0 వెండి మద్రాసు తు1కి 1-6-0

-విమర్శకుడు.

## చిత్రజగత్

కల్యాణం'' తో ప్రతిభ సమన్వితమై ''గర్వభంగం'' పొందిన కంపెనీ, ''పురాణ పురుషుల జన్మ చరిత్ర'' తీసి ధన్యత తెందాలని చూస్తోంది. ... చూసి మాణిక్యములని భ్రమ చెందితే ... ''రామ'' ... గారు ...?

* * *

కొరవ 10 పేజీలో

# సాంస్కృతిక ప్రదర్శనల కంటే వీధుల్లో నాటకాలాడడం మేలు!

చైతన్య ఆర్ట్స్ అకాడమీ ఆరో వార్షికోత్సవం 11 తేది టౌన్‌హాల్‌లో వేడుకగా జరిగింది. కొండా బలరామిరెడ్డి, పొమ్మన సుబ్రహ్మణ్యం, షణ్ముం జనవయ్య, సినీ దర్శకుడు కొండలరావు, ఔత్సాహిక నటుడు ఎం.ఎస్. రావు వేదికపై ఆసీనులయ్యారు. సాంఘిక నాటక ప్రయోక్త, నట దర్శకుడు అబ్బయ్యను అకాడమీ సన్మానించింది. సన్మాన గ్రహీత అబ్బయ్య మాట్లాడుతూ ఔత్సాహిక కళాసంస్థలు, సాంస్కృతిక ప్రదర్శనలు నిర్వహించి నష్టపోవడం కన్నా వీధి నాటకాలు వేయడం మంచిదన్నారు. వీధి నాటకాలకు ప్రజలు స్పందించి ఇచ్చే చిల్లర డబ్బులే కళకు విలువైన పొత్తన్నారాయన. సంస్థ కార్యదర్శి మనుబోలు ప్రభాకర్ తన వార్షిక నివేదిక సమర్పించిన అనంతరం సినిమా సంగీతం, జానపద నృత్యాల పోటీలు జరిగాయి. సినిమా పాటల పోటీల్లో అల్లూరుకు చెందిన రామశేషయ్య, నెల్లూరుకు చెందిన కె. కామేశ్వరరావు, కడపకు చెందిన జి. ఉదయవాలాక్ష్మిరెడ్డి విజేతలయ్యారు. సభానంతరం గుంటూరు సుధాకర్ ప్రదర్శించిన ' మేజర్ చంద్రకాంత్' విచిత్ర వేషధారణ ఆకట్టుకొంది. సంస్థ సభ్యులు నక్కలోళ్ల జీవితాలను ప్రతిబింప చేస్తూ వ్రాసిన 'ఏడవ కంతేతవకండి' నాటిక ఆలోచింప జేసింది. నాటికలో బిజవాడ సింగ్ బందరు సింగ్ బిజిలీ పాత్రలు పోషించిన నటులు పాత్రలకు ప్రాణం పోశారు.

## నెల్లూరు సంగతులు

### గాయత్రీ జయంత్యుత్సవాలు

గాయత్రీ జయంత్యుత్సవాలు 18, 19, 20 తేదీల్లో భారీ స్థాయిలో కో ఆపరేటివ్ బ్యాంక్ ఆవరణలో జరుగనున్నాయి. శ్రీరామ శర్మ ఆచార్య, మాతా భగవతి దేవిశర్మల ఆధ్వర్యంలో 18 తేది పవిత్ర కలశాలతో శోభాయాత్ర నిర్వహిస్తారు. 19 తేది సాయంత్రం 24 వేల దీపాలతో గాయత్రీ దీప మహా యజ్ఞం, 20 తేది సామూహిక అక్షరాభ్యాసం, నామకరణ, అన్నప్రాసన కార్యక్రమాలు జరుగుతాయని గాయత్రీ పరివార్ ప్రతినిధి డాక్టర్ తుమ్మూరి శివ రామకృష్ణా రెడ్డి తెలియ జేస్తున్నారు.

### ఉచిత కంటివైద్యం

డాక్టర్ పి. రఘురామిరెడ్డి ద్వితీయ వర్ధంతిని పురస్కరించుకొని ఆయన జ్ఞాపకార్థం వారి కుమారుడు డాక్టర్ మహేష్ రెడ్డి ఒక ఉచిత కంటి వైద్య శిబిరాన్ని నిర్వహించారు. 11 తేది ప్రముఖ కంటి వైద్య నిపుణులు డాక్టర్ అమర్ అగర్వాల్ నేతృత్వంలో 200 మందికి పరీక్షలు నిర్వహించారు. 12 తేది అవసరమైన 20 మందికి ఆపరేషన్లు చేసి కంటి అద్దాలు కూడా పంచి పెట్టారు. ప్రతి సంవత్సరం ఈ కార్యక్రమం కంటిన్యూ చేస్తానని మహేష్ ఈ సందర్భంగా చెప్పారు. తండ్రి జ్ఞాపకార్థం ఒక మంచి పని చేస్తున్న మహేష్‌కు అభినందనలు.

## నెల్లూరులో ఏడు కోట్ల ఇన్‌కంట్యాక్స్

అధికార దర్పం ప్రదర్శించే బదులు వ్యాపారస్తులకు మంచిగా చెప్పి పన్నులు వసూలు చేసే పద్ధతిని ఆదాయ పన్ను శాఖాధికారులు ఇటీవల అలవర్చు కొన్నారు. ఈ విధానంతో సత్ఫలితాలు కూడా సాధించారు. గత సంవత్సరం జిల్లాలో వ్యాపార సంస్థలు ఆదాయపన్ను శాఖతో సహకరించి సకాలంలో 7 కోట్ల రూపాయల పన్ను చెల్లించారని ఆ శాఖ గుంటూరు విభాగం కమీషనర్ జి.ఆర్.రెడ్డి చెప్పారు. 13 తేది జెడ్.పి.పి. మీటింగ్ హాల్‌లో వివిధ వాణిజ్య సంస్థలు ఏర్పాటు చేసిన సమావేశంలో మాట్లాడారాయన. ఆదాయం పన్ను వసూలు చేయడంలో ఇతర రాష్ట్రాలతో పోల్చి చూస్తే ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానంలో వుంది. ఈ ఆర్థిక సంవత్సరంలో జిల్లాకు ఆదాయపు పన్ను బడ్జెట్ 30 శాతం అధికంగా కేంద్ర ప్రభుత్వం నిర్ణయించినట్లు చావు కబురు చల్లగా చెప్పారాయన. చిన్న చిన్న వ్యాపారస్తులకు శ్లాబ్ రేటుగా నిర్ణయించిన 1400 రూపాయలు సకాలంలో చెల్లించాలని కోరారు. జాప్యం చేస్తే చర్యలు తప్పవన్నారు. డాక్టర్లు, ఇంజనీర్లు, లెక్చరర్లు, లాయర్లు, ఉద్యోగస్తులు ఆదాయపు పన్నును ముందుగా చెల్లించి సకాలంలో రిటన్స్ సమర్పించమన్నారు. కమీసనర్‌కు

కొరవ 8 వ పేజీలో

అల్లూరు ఆదినారాయణరెడ్డి కుమారుడు గిరీష్‌కుమార్, లతల వివాహం ఇటీవల నెల్లూరులో జరిగింది.

## సణుగుడు

### * జిల్లాలో సిపిఎం ఎక్కడుందని ఉద్యమాలు?

జిల్లాలో తాజాగా భూఆక్రమణోద్యమం ప్రకటించింది సిపిఎం. మొదటి నుంచి కమ్యూనిస్టులకు మనుగడ కల్పించింది భూ ఆక్రమణోద్యమాలే. కూలి వాడి కొడుకుగా పుట్టి, కూలివాడిగా బ్రతికి, ఇంకొక కూలి వాడికి తండ్రిగా మారి, మరొక కూలివాడికి తాతగా చనిపోవలసిన దుర్భర సామాజకార్థిక దుస్థితిలో విసిగి పోయి, విరక్తి చెంది, నిరాశా నిస్పృహలతో నీరస పడి పోయి వుండే పల్లెల్లోని పాటక జనాన్ని ఆకర్షించ డానికి ఈ ఉద్యమాలెంతో ఉపకరించాయి. భారతదేశం వంటి వ్యవసాయాధారిత ఆర్థిక వ్యవస్థలో భూమికి కీలకమైన పాత్ర వుంది. మొలమీద గోచీ తప్ప ఏడేడు తరాల నుంచి తనదంటూ చెప్పుకోవడానికి ఏమీ లేని నిర్భాగ్యుడు, తన కంటూ బారెడు నేల స్వంతానికి వస్తుందని తెలిస్తే ఎంత ఆనంద పడతాడో మాటల్లో వర్ణించడం అసాధ్యం. ఆ పరిస్థితి అనుభవించే వారికి తప్ప, ఆ సంతోషం వూహించడం సాధ్యం కాదు. స్వంత నేల అనే కలే పేదవాడికి పెద్ద కిక్కునిస్తుంది. ఆ ఆశలో, ఆ మత్తులో, ఆ ఉన్మాదంలో వాడెంతకైనా తెగించడానికి సిద్ధ పడతాడు. ఉద్దేశ్యం సదుద్దేశ్యమే అయినా, కిలెరిగి వాత పెట్టినట్లు, ఇన్నాళ్లు కమ్యూనిస్టులు ఈ కీలకమైన పేదవాడి బలహీనత పైనే రాజకీయం చేస్తూ వచ్చారు. నాలుగు దశాబ్దాల క్రితం కమ్యూనిస్టులు దేశమంతటా మార్మోగించిన "కాడెద్దులు, ఐదెకరాల నేల" నినాదం ఎంతటి రాజకీయ సంచలనం సృష్టించిందో చరిత్ర తెలిసిన వారికంతా తెలుసు. 1950 దశకంలో, దేశంలో కాంగ్రెస్ ప్రభుత్వాలు కూలిపోయి కమ్యూనిస్టులు అధికారం చేజిక్కించు కుంటారా అన్నంత ప్రమాదకర పరిస్థితులను సృష్టించింది ఆ నినాదం.

కమ్యూనిస్టులు నడిపిన భూ ఉద్యమాలే ఇందిరా గాంధీ అమలు చేసిన విప్లవాత్మక భూసంస్కరణలకు ప్రేరణ అనడం నిజం. కొన్ని వందలేళ్లుగా దేశంలో పాతుక పోయిన భూస్వామ్య వ్యవస్థను కూకటి వ్రేళ్లతో

**డోలేంద్ర**

కొరవ 7 వ పేజీలో

# వైభవంగా ఆదినారాయణ రెడ్డి కుమారుడి వివాహం


డిఐజిలు జయచంద్ర, దినేష్ రెడ్డిలతో వధూవరులు ఆదినారాయణ రెడ్డి


వధూవరులను చెయ్యెత్తి ఆశీర్వదిస్తున్న పెళ్ళకూరు రామచంద్రా రెడ్డి గారు


పెళ్ళకూరు రామచంద్రారెడ్డి, మాగుంట సుబ్బరామరెడ్డి గార్లతో అల్లూరు అదినారాయణరెడ్డి, సురేంద్రరెడ్డి మహేష్‌రెడ్డి.

పెద్దాయన పెళ్ళకూరు రామచంద్రారెడ్డి గారి అనుంగు శిష్యుడు, రామభక్త హనుమాన్, మాగుంట సుబ్బరామ రెడ్డి గారి అనుచరుడు, నెమ్మదస్తుడు, అందరికీ మంచిగా వుండే అల్లూరు ఆదినారాయణ రెడ్డి - సులోచనమ్మల జ్యేష్ఠ కుమారుడు ఇంజనీరింగ్ పట్టభద్రుడు గిరీష్‌కుమార్, దువ్వూరు గోపాలరెడ్డి కుమార్తె సైన్సులో పోస్ట్ గ్రాడ్యుయేట్ లతల వివాహం జిల్లాలోని ప్రముఖ రాజకీయ నాయకులు, పోలీస్ ఉన్నత అధికార్లు, స్నేహితుల ఆశీస్సులతో రంగ రంగ వైభవంగా ఈ నెల 4 తేది నెల్లూరు టిటిడిలో జరిగింది.


వధూవరులకు శేష పోస్తున్న నేదురుమల్లి పద్మనాభరెడ్డి


వధూవరులనాశీర్వదిస్తున్న జిల్లా తెలుగుదేశం నాయకులు సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి


భక్తవత్సలరెడ్డి గారితో అల్లూరు సోదరులు ఆదినారాయణ రెడ్డి, సురేంద్ర రెడ్డి

అల్లూరు ఆదినారాయణ రెడ్డి, రామసుబ్బారెడ్డి, ఆదిశేషారెడ్డి, సురేంద్రరెడ్డి, అక్కవరపు బలరామిరెడ్డి గారలు విచ్చేసిన వారందరికీ సాదరంగా ఆహ్వానం పలికారు.


ఆహ్వానితులు పొలిచెర్ల ప్రసన్నకుమార్ రెడ్డి, మాగుంట శ్రీనివాసులు రెడ్డి నాయుడు దశరథరామిరెడ్డి, దినేష్‌రెడ్డి I.P.S. గారలు

వధూవరులనాశీర్వదించిన పెద్దలందరికీ ఆదినారాయణరెడ్డి దంపతులు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నారు.

## నెల్లూరు ముచ్చట్లు

### విమర్శకుడు

### జనార్ధన రెడ్డి

ఎఐసిసి సమావేశాలలో పాల్గొని, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఎన్.జనార్ధనరెడ్డి నిన్న (16తేది) హైదరాబాదు వచ్చారు. 18 తేది రాత్రి మద్రాసు మీదుగా, కావాలి వస్తారు. 19తేది ఉదయం నెల్లూరు ఎల్పీల్లో చూసుకొని మైపాడు వెళ్తారు. మధ్యాహ్నం నెల్లూరులో విశ్రాంతి. సాయంత్రం 4.30 కి ఉదయగిరి. రాత్రికి కావాలి. 20 తేది ఉదయం మద్రాసు మీదుగా, హైదరాబాదు.

### రొట్టెల పండుగ

హిందు, ముస్లిం సాంస్కృతిక సమైక్యతకు చిహ్నమైన రొట్టెల పండుగ 23తేది జరుగుతుంది. బారా షహీద్ దర్గా మేనేజింగ్ కమిటీ అన్ని ఏర్పాట్లు చేస్తోంది.

### సిసిఎస్‌కు కొత్త సిఐ

నెల్లూరు సెంట్రల్ క్రైం పోలీస్ స్టేషన్ ఇన్స్‌పెక్టర్‌గా గుంటూరు నుంచి వచ్చిన శ్రీ ఎస్.గౌస్ మొహిద్దీన్ నియమితులైనారు. గౌసమొహిద్దీన్ ఇదివరకు ఇక్కడ కొంత కాలం పనిచేసి వెళ్లాడు.

గత ఆరు నెలల్లో సిసిఎస్‌కు నలుగురు సిఐలను నియమించి, వెంట వెంటనే బదలీ చేశారు. అంత నిలకడ లేని ఉత్తరువులైతే, వాటికి విలువేముంటుంది? నెలకొక ఇన్స్‌పెక్టర్ మారే పరిస్థితులలో నేర పరిశోధన ఎంత సుందర ముదనష్టంగా వుంటుందో వేరే చెప్పాలా? డిఐజి గారు ఒకర్ని ఒక స్టేషన్‌లో నియమించేముందే అన్నీ ఆలోచించుకొని చేయడం గౌరవం కాదా?

# వినాయక హాలు కూలగొడతారా?

నెల్లూరు వినాయక హాలును కూలగొడతారా ? రేపు, ఎల్లుండిలో ఆ కార్యక్రమం జరిగిపోతుందా? దేవాదాయశాఖ ఉన్నతాధికారులు అత్యంత గోప్యంగా జరుపుతున్న ఏర్పాట్లు చూస్తుంటే ఇది నిజమని పిస్తున్నది.

వినాయక సినిమా హాలు ప్రక్కనే వున్న ఆరణి కందప్ప మేస్త్రి సత్రం ఆస్తి. హాలుతోపాటు లోపలే వున్న కొయ్యల మిల్లు, యూనియన్ బ్యాంకు భవనం, వెంకట్రామ అండ్ కో తదితర అంగళ్లున్న ప్రదేశం కూడా సత్రానికి చెందినదే. మొత్తం 6 ఎకరాల విస్తీర్ణం కల్గిన ప్రదేశం ఇది. రంగమహల్, శేషమహల్ తదితర స్థలాలను కొన్ని దశాబ్దాల క్రితమే ఆక్రమించారని చెప్తారు. ఆక్రమణలు పోగా సత్రానికి ఇంకా మూడెకరాల 50 సెంట్లు మిగిలి వుంది. అందులోనే వినాయకహాలు తదితరాలుండేది.

ఇప్పుడు వినాయక హాలు నెలకు 5 వేలు, యూనియన్ బ్యాంకు నెలకు 7 వేల 500, కొయ్యల మిల్లు ఇటీవల కొద్దికాలం నుంచి నెలకు 4 వేలు లెక్కన నెల బాడుగ చెల్లిస్తున్నాయి. వెంకట్రామ అండ్ కో, తదితర అంగళ్ల వారు నెలనెలా గది బాడుగలు చెల్లిస్తున్నారు. అయితే వీరిలో వినాయక హాలు, కొయ్యల మిల్లులకు సంబంధించి సత్రం యాజమాన్యంతో వివాదం వుంది. వారిని ఖాళీ చేయించేందుకు కోర్టుల ప్రయత్నం జరుగుతున్నది. సాధారణ పరిస్థితులలో ఆ వివాదాలు పరిష్కారం కావడానికి ఎన్నేళ్లు పడుతుందో ఎవరూ చెప్పలేరు. నెల్లూరు టౌన్‌లో చాలా దేవాలయ ఆస్తులు ఇట్లా వివాదాలలో మ్రగ్గి పోతున్నాయి.

ఏమి జరిగిందో, ఏమో కాని, దేముళ్ల మంత్రి శ్రీ కలికి యానాదిరెడ్డి హఠాత్తుగా ఈ సత్రం ఆస్తులపై ప్రత్యేక శ్రద్ధ చూపారట. రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవా ? రాత్రికి రాత్రి సత్రం ఆస్తులలో వున్న వారందరినీ ఖాళీ చేయించేందుకు అత్యంత రహస్యంగా ఉత్తర్వులు తయారై పోయాయి. కనీసం సత్రం ట్రస్ట్ బోర్డుకు కూడా విషయం తెలీదు. ఈ రోజు (17 తేది) పెద్ద సంఖ్యలో దేవాదాయ శాఖ అధికారులు నెల్లూరులో దిగారు. కలెక్టరు, ఎస్.పి. వంటి జిల్లా అధికారులకు సమాచారం అందించబడింది. రేపు -18 తేది ఉదయం వినాయక సినిమా హాలును కూలగొట్టడం తోపాటు బ్యాంకును, ఇతర బాడుగకున్న వారిని ఖాళీ చేయించడానికి మందీ మార్బలం సమకూర్చు కుంటున్నారు. ఎట్టి పరిస్థితులలోనూ ఆదివారం సాయంత్రానికి ఆస్తులు స్వాధీనం కావాలని మంత్రిగారి హుకుం అట. ఆయనకు ఉన్నట్లుండి ఈ సత్రం ఆస్తులపై ఇంత మమకారం ఎందుకు కల్గిందో శివుడికే తెలియాలి.

అయితే ట్రస్టుబోర్డు ఛైర్మన్ శ్రీ మారుతి ప్రసాద్ ఈ కూల్చివేతను వ్యతిరేకిస్తున్నారు. ఆర్థికంగా మంచి స్థోమతలో వున్న సత్రానికి ఇప్పుడు ఆస్తులు స్వాధీనం చేసుకొని, అమ్ముకోవలసిన అవసరం లేదని; బాడుగలను పెంచుకొంటే సరిపోతుందని ; ట్రస్టుబోర్డుకు కనీస సమాచారం లేకుండా అధికారులు స్వతంత్రించి ఇంత పెద్ద కార్యక్రమం చేపట్టడం తమను అవమానించినట్లేనని, అందువల్ల తాము ప్రతిఘటిస్తున్నామని వారంటున్నారు. ఏమి జరుగుతుందో రేపు తేలిపోతుంది.

వినాయక హాలు కూల్చివేత జరిగితే, మంత్రిగారు అదే పట్టుదలతో రంగనాథుడికి చెందిన రాఘవ విహార్ లాడ్జి, వక్ఫ్‌కు చెందిన న్యూటాకీస్ హాలు కూడా స్వాధీనం చేసుకోవడం బాగుంటుంది.

### డేగాకు పదవి

రాజకీయ నిరుద్యోగంతో నరాల నిస్సత్తువకు గురై దిగులుపడి వుండిన మాజీ జిప్రప ఛైర్మన్ శ్రీ డేగా నారసింహారెడ్డి గారిని రాష్ట్ర తెలుగు ఆర్థిక సమాలోచన కమిటీలో సభ్యుడుగా నియమించారు. ఎన్టీఆర్ డేగాకు ఇంత పెద్ద పీట వేయడం ఆశ్చర్యకరం.

ఎవరెన్ని చెప్పినా నారసింహారెడ్డిగారు కల్తీలేని కాంగ్రెస్ వ్యతిరేకి. పొరపాటున కూడా ఎప్పుడూ కాంగ్రెస్‌తో, కాంగ్రెస్ నాయకులతో సంబంధాలు పెట్టుకోను ప్రయత్నించిన వాడు కాదు. జిల్లా తెలుగుదేశంలో రమేషరెడ్డి తర్వాత డేగా కంటే నిఖార్సయిన నాయకుడు లేడు. తక్కిన అందరూ ఎప్పుడో ఒకప్పుడు పరపార్టీ సంపర్కంతో మలినమైనవారే. ఈ ఏకపత్నీ వ్రతానికి ఇన్నాళ్లకు గుర్తింపు లభించినట్లుంది. లక్ష్మీపార్వతి శుశ్రూష ఫలితమేమో, మనకు తెలియదు.

### ఏఆర్ కాలేజికి ఇన్నాళ్లకు మంచిరోజులు

బిడ్డొచ్చిన వేళ, గొడ్డొచ్చినవేళ అంటారు. ఆనం వివేకానందరెడ్డి ప్రెసిడెంట్‌గా ఎన్నికైన వేళా విశేషమేమో గాని, ఏఆర్ కాలేజికి మంచి రోజులు వచ్చినట్లున్నాయి. చదువులు నేర్పని చదువుల ఖార్ఖానాగా అప్రతిష్ఠ పాలై వుండిన ఈ కళాశాలలో ఈ ఏడాది విశ్వవిద్యాలయం స్థాయిలో నాలుగు ర్యాంకులు వచ్చాయి. బిఎస్‌సిలో కె.ఎన్.శ్రీధర్ అనే విద్యార్థి 6 వ

తరువాయి 7 వ పేజీలో

## సణుగుడు

4 పేజీ కొరవ

సహా పెకలించే భూసంస్కరణలను అమలు చేయగల సాహసం, తెగువ అసలు కొక్కరికే వుండినాయి. ప్రపంచంలో మరే వ్యవసాయ భారత ప్రజాస్వామ్య దేశం లోనూ ఇందిరా గాంధీ వలె భూమిని పేదలకు పంచిన నాయకులు లేరు. చరిత్రలో సువర్ణాక్షర లిఖిత ఆర్థిక సంస్కరణ అది. దాని ఫలితాలేమిటి, అది అమలు జరిగిన తీరేమిటి అన్న మీమాంస వేరే సంగతి. కమ్యూనిస్టులనే వాళ్లు లేకుంటే ఇందిరా గాంధీ కూడా అటువంటి సాహసోపేత నిర్ణయం తీసుకునే వారు కారనడం నిజం. ఈ రోజు దేశంలో కోట్లాది మంది నిరుపేద వ్యవసాయ కూలీలు ఎకరానో, అరెకరానో సాగు చేసుకుంటూ, ఆత్మగౌరవంతో రైతుల వలె బ్రతుకు తున్నారంటే, అది ప్రత్యక్షంగా ఇందిరా గాంధీ, పరోక్షంగా కమ్యూనిస్టులు పెట్టిన భిక్ష! ఎన్ని తరాలు గడిచినా పేదవాడు వీరిద్దరినీ మరువ కూడదు.

అయితే ఆనాటి రోజులు ఆనాటి ఆర్థిక, సామాజిక పరిస్థితులు ఈ రోజు లేవు. దర్జాగా, దర్పంగా బ్రతుకు తుండిన రైతాంగం ఇప్పుడు సగం వూపిరితో చావలేక బ్రతుకుతున్నది.

ఇప్పుడు రైతులపై భూ ఆక్రమణోద్యమం అంటే, ఫలం ఎన్నికల స్టంట్‌గా భావించాలి. దాదాపు పదేళ్ళ నుంచి జిల్లాలో సిపిఎం పేదలకుపయోగపడే కార్యక్రమాలు ఏవీ చేపట్టినట్లు గుర్తులేదు. తెలుగుదేశం అధికారంలో వుండడం, నాయకుడు శ్రీ జక్కా వెంకయ్య శాసన సభ్యుడు కావడం వంటి పరిణామాల వల్లవారు దాదాపు మౌన ప్రేక్షకులవలె వుండిపోయారు. ఉద్యమాలే కాదు, ప్రజోపయోగకర ఆందోళనలు వేటిలో కూడా వారు పాలు పంచుకోలేదు. వున్న సమయమంతా సీట్ల పంపకం కోసం ఎన్టీఆర్‌ను దేబిరిస్తూ, తోక పట్టుకొని తిరగడానికే సరిపోయింది. ఇప్పుడు వారికి స్వతంత్రించి ఒక మండలం గెల్చుకొనే స్థోమత కూడా లేదు. కార్యకర్తలూ చెందర వందరై పోయారు. ఎర్రకోటల వలె వుండిన నేలటూరు, పెనుబల్లి వంటి పల్లెలు కూడా వెజారిపోయాయి. టౌన్‌లో వారి పాత్ర నామమాత్రావశిష్టం. జిల్లాలో వారు ఫలానా చోట ప్రజలతో సన్నిహితంగా వున్నారని చెప్పుకోడానికి ఒక్క వూరు కన్పడటం లేదు. అటువంటి స్థితిలో భూ ఆక్రమణోద్యమం ఏమిటి? ఎందుకు చేపడుతున్నారు? దీనివెనుక వున్న అంతరంగికోద్దేశ్యం ఏమిటి? కోస్తా తీరంలో బంగారు గని వలె మారిన రొయ్యల పొలాలపై తమ ప్రతాపం ప్రదర్శించడం వీరి ఉద్దేశ్య మంటున్నారు. రొయ్యల భూముల్లో అక్రమాలు, ఆక్రమణలు లేక పోలేదు కాని, ఇప్పుడిప్పుడే జిల్లాలో కుదుటపడుతున్న ఒక కీలకమైన పరిశ్రమ రాజకీయాల సుడిగుండంలో చిక్కుకోవడం చాలా ప్రమాదకరం. ఆ పరిశ్రమ దెబ్బతింటే, జిల్లా మొత్తం నష్టపోతుంది.

## PUBLIC NOTICE

యిందు మూలంగా తెలియ పరచటమేమనగా కావలి- శ్రీ వెంకట సాయి స్టీల్ సిండికేట్ ఫరంలో నేను భాగస్థునిగా వుండి తే31-3-1994 ది నుండి విడిపోయినాను. నాకు ఆ ఫరంతో ఎలాటి సంబంధము లేదు. ఆ ఫరంతో జరుపు లావాదేవిలకు మీ రిస్క్ మీద చేయవలసినదే.

ఇట్లు
తటపర్తి శ్రీనివాసరావు, కావలి

## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ కొరవ

ర్యాంకు, పి.ఎన్.నాయుడు 8 వ ర్యాంకు సాధించారు. బీకాంలో సూరం శిరీష అనే విద్యార్థిని, ఎ.జగదీశ్ విక్రమ్ అనే విద్యార్థి కలిసి 9 వ ర్యాంకు పొందారు.

ఎప్పుడూ చదువుల్లో పేరు విన్పడని శ్రీ వేణుగోపాల స్వామి దేవాలయం కాలేజీలో కూడా విద్యార్థులు ప్రతిభావంతంగా పరీక్షల్లో ఉత్తీర్ణులైనారు. బిఎలో ర్యాంకులు వచ్చాయి ఈ కాలేజీకి. బిఎలో పిఎల్ కుమారి మొదటి ర్యాంకు సాధించింది. విశేషమైన ఫలితం ఇది. పి.పుల్లయ్య అనే విద్యార్థి ఐదవ ర్యాంకు, సి.హెచ్. చంద్రశేఖర రెడ్డి 6 వ ర్యాంకు సాధించారు.

కోచింగ్ సెంటర్ల ప్రవాహంలో కొట్టుకపోతున్న విద్యారంగంలో వీఆర్ కాలేజి, వేణుగోపాల స్వామి కాలేజి వంటి సాధారణ కళాశాలల విద్యార్థులు ర్యాంకులు సాధించడం ప్రశంసనీయం. అయ్యవార్లు బుద్ధిగా కాలేజికి హాజరై చదువులు చెప్తే, వేలు తగలేసి విద్యా వాణిజ్య కేంద్రాల్లో పిల్లలను రాచిరంపాన పెట్టవలసిన అగత్యం లేదని నిరూపిస్తున్నాయి ఈ ఫలితాలు. పిల్లలకు, అయ్యవార్లకు కూడా అటెండెన్సు కంపల్సరీ చేసి, క్రమశిక్షణ నెలకొల్పితే వీఆర్ కాలేజి పూర్వవైభవం సంతరించు కోవడం ఖాయం. వివేక ఆ పుణ్యం కట్టుకుంటే నెల్లూరులోని ప్రతి ఒక్కరూ అభినందిస్తారు.

## నెల్లూరుకు ప్రత్యేక ఆర్టీసి జోన్

నెల్లూరు ఆర్‌టిసికి కొత్త జోన్‌ను మంజూరు చేశారు. సోమవారం నుంచి ఈ జోన్ పని ప్రారంభించింది. నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు జిల్లాలు ఈ జోన్ పరిధి క్రిందకు వస్తాయి. నెల్లూరులో ఇప్పటికే ఆర్‌టిసి రీజియన్, రెండు డివిజన్‌లు వున్నాయి. జోనల్ ఇన్‌ఛార్జిగా ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీ పి.ప్రభాకర గుప్త నియమితులైనారు.

ఆర్‌టిసి ఎం.డి.గా శ్రీ ఆంజనేయరెడ్డి నియుక్తులు కావడం వల్ల నెల్లూరుకు జరిగిన ఉపకారం ఇది. ఆయన కృపే లేకుంటే ఇంత పెద్ద కార్యాలయం మనకు వచ్చే సమస్యే లేదు. ఆంజనేయ రెడ్డి గారు తానున్నప్పుడే నెల్లూరుకు రీజినల్ వర్క్‌షాపు కూడా తరలించగల్గితే, వెయ్యి మందికి పైగా ఉపాధి పొందుతారు. పదికాలాలపాటు పేరు చెప్పుకుంటారు.

## లయన్స్ ఉచిత శిబిరం

నెల్లూరు లయన్స్ క్లబ్ 18 నుండి 20 తేది వరకు పెద్దాసుపత్రిలో ఉచిత నేత్ర చికిత్సా శిబిరం నిర్వహిస్తున్నది. డాక్టర్ కృష్ణారెడ్డి ఆపరేషన్లు చేస్తారు. పేదలెవరైనా ఈ అవకాశం వినియోగించు కోవచ్చు.

## జవహర్ భారతి రిటైర్డ్ ప్రిన్సిపల్ మరణం

కావలి జవహర్ భారతి రిటైర్డ్ ప్రిన్సిపల్ శ్రీ గుంటూరు గోపాల కృష్ణమూర్తి 10 తేది రాత్రి నెల్లూరులో మరణించారు. ముప్పయ్ సంవత్సరాలకు పైగా జవహర్ భారతిలోనే బోటనీ లెక్చరర్‌గా వుండి, అదే కాలేజికి ప్రిన్సిపల్‌గా పనిచేసిన వారాయన. ఆయన వయస్సు 61 సంవత్సరాలు. భార్య, నలుగురు కుమార్తెలు, ఒక కుమారుడు వున్నారు. అందరూ ఉన్నత విద్యావంతులే.

## పివి

మొదటి పేజీ కొరవ

గ్రూపుకు చెందిన ద్రోణంరాజు ప్రభృతులు హాజరైనా నోరు మెదపలేదు. వై.ఎస్. విడిగా ప్రధాని అపాయింట్‌మెంట్ తీసుకున్నారు. బహుశా ఆయన ఆ వ్యక్తిగత సమావేశంలో తమ తరఫు వాదన వినిపించవచ్చు.

## పిసిసి ప్రక్షాళన

మరో వారం రోజుల్లో పిసిసిని ప్రక్షాళన చేసే కార్యక్రమం ప్రారంభం కావచ్చు. ఆంధ్రప్రదేశ్ వ్యవహారాల పై ప్రధాని చాలా పట్టుదలగా వున్నారట. ప్రస్తుతానికి గ్రామ కమిటీల ఏర్పాటును చేపట్టాల్సిందిగా ఆయన పిలుపు నిచ్చారు. గ్రామ గ్రామాన కాంగ్రెస్ జెండా అన్న నినాదంతో పార్టీని ఉత్తేజింప చేయాలని ఆయన నిర్ణయించారు. ఏఐసిసి సమావేశాల వత్తిడి నుంచి బయట పడ్డారు కనుక పివిజీ ఇక పార్టీ వ్యవహారాల పై శ్రద్ధ తీసుకుంటారని కాంగ్రెస్ నాయకులు ఆశపెట్టుకున్నారు. పి.వి.జీ. తన సహజ సిద్ధమైన నాన్చుడు ధోరణి నుంచి బయటపడి పంజా విప్పితే కాంగ్రెస్‌కు మంచి రోజులు రావడం ఖాయం.

## తిరుగులేని నాయకుడు

ఏఐసిసి సమావేశాల్లో తిరుగులేని నాయకుడిగా మరో సారి రుజువు చేసుకున్న ప్రధాన మంత్రి పివి నరసింహారావు ఇక రాష్ట్ర వ్యవహారాలపై దృష్టి సారిస్తారని భావిస్తున్నారు. రాష్ట్రంలో కాంగ్రెస్ అసమ్మతి, అసంతృప్తి సెగలతో కుత కుతలలాడిపోతున్నది. పార్టీని, ప్రభుత్వాన్ని జోడెద్దుల మాదిరిగా ఒక గాట కట్టి ముందుకు నడపాల్సిన ముఖ్యమంత్రి ముఠా నాయకుడిగా వ్యవహరిస్తున్నారన్న విమర్శ బలంగా వున్న నేపథ్యంలో రాష్ట్ర కాంగ్రెస్‌కు శస్త్ర చికిత్స చేసే సమయం ఆసన్నమైందని ప్రధాని భావిస్తున్నారు. రాష్ట్రంలో సాధారణ ఎన్నికలు పట్టుమని ఆర్నెల్లయినా లేవు. మరో మూడు నెలల్లో ఎన్నికల తతంగం మొదలవుతుంది. గత రెండేళ్లుగా రాష్ట్రంలో చెప్పుకోదగ్గ అభివృద్ధి పనులేవీ జరగలేదు. కనీసం ఈ మూడు నెలల్లో అయినా ప్రభుత్వం కదిలినట్లు కనిపించక పోతే ఎన్నికల్లో నియోజక వర్గాలకు వెళ్లి ముఖం చూపించే పరిస్థితులు లేవని ఎమ్మెల్యేలు అంటున్నారు. మరో పక్క ప్రభుత్వం మీద నెగటివ్ ప్రచారంతో పట్టు సంపాదించడానికి అటు తెలుగుదేశం, ఇటు బహుజన సమాజ్ పార్టీ ప్రయత్నిస్తున్నాయి. ఈ రెండు పార్టీల విమర్శను తిప్పి కొట్టే యంత్రాంగం కానీ, మంత్రాంగం కానీ కనపించటం లేదు. ముఖ్యమంత్రితో విభేదించిన మూలవిరాట్టులు ఇప్పటికీ తలోదారిగా వున్నారు. వై.ఎస్. నేదురుమల్లి, జలగం వారు, శివశంకర్, హనుమంత రావు అంటే అంటనట్లు వ్యవహరిస్తున్నారు. వీరందరిని కలుపుకు పోవటానికి ముఖ్యమంత్రి కూడా చొరవ తీసుకోవడం లేదు.

## ఉత్తరక్రియలు


పులిమి శివకోటారెడ్డి

### పులిమి శివకోటారెడ్డి గారు

25.5.94తేది బుధవారం
స్వర్గస్తులైరి వారి ఉత్తరక్రియలు 18.6.94 తేది శనివారం కోవూరులోని మా స్వగృహమునందు జరుగును.

భార్య: పి. సరస్వతి
కొడుకులు: పి. శశిధర రెడ్డి, పి. ఆదెపరెడ్డి
కోడళ్లు: పి. పద్మజ, పి. శోభ
కూతుళ్లు: పి. సుగుణ, పి. స్వర్ణలత, టి. కల్పన
అల్లుళ్లు: డా. పి. సీతారామిరెడ్డి, డా. పి. విజయరామిరెడ్డి, టి. రవీంద్ర రెడ్డి



## సుమాంజలి R.K. అపార్టుమెంట్స్

### నెల్లూరు వారి ప్రకటన

క్రింది షెడ్యూలు దాఖలా ఆస్తిని కొప్పరపు సత్యనారాయణ, వారి కుమారులు నరసింహ రావు, సుబ్బారావు, రాధాకృష్ణ, నాగేశ్వర రావు మరియు కుమార్తెలు జి. లలిత, వై. ఉషారాణి, జె. శైలజ, కె. భారతి అను వారలు మాకు అగ్రిమెంటు ద్వారా విక్రయించి యున్నారు. పై వారు అగ్రిమెంటు షరతులకు భంగం కల్గించినందున సదరు అగ్రిమెంటు అమలు కాకుండా నిలిపి యున్నాము. సదరు అగ్రిమెంటు రద్దు కాలేదు. పై వారలు సదరు స్థలమును ఇతరులకు విక్రయించుటకు ప్రయత్నం చేయుచున్నట్లు తెలియు చున్నది. సదరు ఆస్తిని వారు అన్యాక్రాంతము చేయుటకు వారికి హక్కులేదు. సదరు ఆస్తిని ఎవరు కొనుగోలు చేయుటకు వీలులేదు. ఎవ్వరైనా అట్లు చేసినచో అట్టి కొనుగోలు చెల్లదు. వారికి సదరు ఆస్తి యందు ఎలాంటి హక్కులు సంక్రమించవు. మేము తీసుకొన బోవు చట్టపరమైన చర్యలకు మాకు కలుగు నష్టకష్టములకు అమ్మిన వారు, కొనుగోలు చేసిన వారు అందరు బాధ్యులగుదరని ఇందు మూలంగా యావన్మందికి తెలియ చేయడమైనది.

### షెడ్యూలు

నెల్లూరు టవున్ నవాబుపేట, నరుకూరు రోడ్డుకు దక్షిణం వైపున W. No. 4, డోర్ నం. 69 - 72 - 73 - 74 రు కు సంబంధించిన ఖాళీ స్థలము 710 అంకణములు లేక 4749 - 190 చ.మీ. స్థలమునకు హద్దులు. తూర్పు: కె.వి. కృష్ణారావు స్థలము వెంబడి విక్రయ స్థలమునకు సంబంధించిన స్వంత ప్రహరీ గోడ; దక్షిణం: పగడాల రంగయ్య వగైరాల యిండ్లు స్థలం వెంబడి ఈ స్థలము సొంత గోడ; పడమర: మునిసిపల్ బాల భవన్ మరియు మునిసిపల్ స్కూలు మరియు హాస్పిటల్ వెంబడి విక్రయ స్థలం స్వంత ప్రహరీ గోడ; ఉత్తరం: రోడ్డు కొంత, పొట్టి రామయ్య వగైరాల యిల్లు కొంత.
పై స్థలం స్వంత గోడలతో సహా యావత్తు యాజిమెంటు హక్కులతో మాకు అగ్రిమెంటు చేయడమైనది.

**కొమ్మూరు సుధాకర రావు**
సుమాంజలి R.K.అపార్టుమెంట్స్, నెల్లూరు.

# శివారెడ్డి పద్యాలు

నన్ను కన్నతల్లి నా తల్లి శేషమ్మ
ఎక్కడుందో ఇప్పుడు ఏమైందో
కానరావటంలె కరదాక వెళ్ళొస్తా
వెళ్ళివెంటనే తిరిగి మళ్ళివస్తా

ఇల్లు లేకపోతె ఇబ్బంది పడబల్లె
భార్యలేక పోతె బాధలేదు
అన్నిపాన్ని కొరకు ఆరాట పడబల్లె
కన్నతల్లి పోతె ఖాళీలైఫ్

తాతనైనాక తలకాయనరికాక
ఉడుకు నెత్తురొంట్లో ఉడిగినాక
మునుపటాల కలము ముందంజ వేయుడంలె
కాల మహిమ ఒకటె కన్నుబుస్సు.

కమ్యూనిష్టుపార్టీ కనిపించడములేదు
ఇండిపెండియన్స్ ఎక్కుడుందో
కాంగిరేసు పార్టీ కనిపెట్టుకోనుంది
అమరజీవి, కవికి అందరొకటె!

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

సన్మానం చేసిన వ్యాపార సంస్థలు చిన్న వ్యాపారస్తులకు విధించిన ఆదాయపు పన్ను శ్లాబ్ 1400 నుండి 750 రూపాయలకు తగ్గించాలని కోరారు. కార్యక్రమంలో అసిస్టెంట్ కమీషనర్ రవీంద్రనాథ్ రెడ్డి, టాక్స్ పేయర్స్ అసోసియేషన్ అధ్యక్షుడు ఆర్. పి.శేషయ్య, రైస్ మిల్లర్స్ అసోసియేషన్ అధ్యక్షుడు రామచంద్ర నాయుడు, వాణిజ్య సంస్థ అధ్యక్షులు కె.తిరుమల రావు తదితరులు వేదికపై ఆశీనులయ్యారు.

### మునిసిపాలిటీ మంచినీటి కార్యక్రమం

ఈ సంవత్సరం టౌన్‌లో పలుచోట్ల మంచినీటి సరఫరాకు అంతరాయం ఏర్పడి ప్రజలు పడరాని పాట్లు పడ్డారు. దొంగలు పడ్డ ఆరు నెలలకు...సామెత చందాన ఎండలు క్రమేపి తగ్గాక మునిసిపల్ అధికారులు నిద్ర నుండి మేల్కొన్నారు. తాజాగా ఒక దశాబ్దం తరువాత మునిసిపాలిటీ వారు ఓ కొత్త కార్యక్రమం మొదలెట్టారు. మునిసిపల్ నీటిపారుదల శాఖలో పనిచేసే యింజనీరింగ్ సిబ్బంది స్పానర్లు, సుత్తులు తీసుకొని వీధుల్లో పడ్డారు. మంచినీటి సరఫరాను క్రమబద్ధం చేసే చర్యల్లో భాగంగా నిర్దేశించిన జట్లు తమకు కేటాయించిన ప్రాంతాలకు వెళ్లి పబ్లిక్, పర్సనల్ కొళాయిల్లో లీకేజిలకు రిపేర్లు చేస్తారట. మెయిన్ పైపుల మరమ్మత్తులు చేపడతారట. ఈ జట్లు ప్రతి సోమవారం నవాబుపేట; మంగళవారం స్టోన్‌హౌస్‌పేట; బుధవారం బృందావనం; పొగతోట, రామ్మూర్తి నగర్, హరనాథపురాల్లో పర్యటిస్తాయి. గురువారం జెండావీధి, చిన్నబజారు, పెద్దబజారు, ట్రంకురోడ్డు, సుబేదారు పేట; శుక్రవారం మూలాపేట, దర్గామిట్ట, పొదలకూరు రోడ్డు; శనివారం సంతపేట, రంగనాయకుల పేటల్లో ఉదయం 6 నుండి 11 గం. వరకు కొళాయి పైపుల పనిపడ్తారు.

నీటి సరఫరా విషయమై ప్రజల అభిప్రాయాలను తెలిసికొనేందుకు 'మంచినీటి సరఫరా ఫిర్యాదుల పెట్టెలు' టౌన్‌లోని అన్ని పోలీస్‌స్టేషన్‌ల వద్ద అరేంజ్ చేశారు. పెద్ద పోస్టాఫీసు, జెండావీధి నీళ్లట్యాంకు, రంగనాయకుల పేట పోస్టాఫీసు, దర్గామిట్ట పోస్టాఫీసు వద్ద కూడా అదనంగా ఈ పెట్టెలు పెడుతున్నారు. అయినా పోలీస్ స్టేషన్‌ల వద్ద ఏర్పాటు చేసే పెట్టెల్లో ప్రజలెవరైనా ఫిర్యాదులు వేస్తారాండి! మొత్తానికి 'కెప్టెన్' గారికి మంచి ఆలోచనే వచ్చింది. మరి వారి 'క్రూ' ఎలా పనిచేస్తుందో చూసి చెప్తాం.

### సాయిరాం వెల్ఫేర్ సొసైటీ

అనాథ పిల్లలకు వయో వృద్ధులకు సహాయ, సహకార, సంరక్షణలు కల్పించాలని శ్రీ ప్రభు సాయిరాం వెల్ఫేర్ సొసైటీ ఏర్పాటు చేసినట్లు సొసైటీ ఛైర్ పర్సన్ డాక్టర్ జయప్రద చెప్పారు. సంస్థకు కావల్సిన నిధులను చందాల రూపంలో కాకుండా ప్రజోపయోగ కరమైన అంశాలపై విభిన్న పుస్తకాలను ప్రచురించి వాటిద్వారా వచ్చే ఆదాయంతో ట్రస్టు నడుపుతారట. సంస్థకు డాక్టర్ వై. సంజీవరావు వైస్ ఛైర్మన్‌గా, ఎం. సాయిబాబు కార్యదర్శిగా, డాక్టర్ ప్రసాద్ కోశాధికారిగా, డాక్టర్ జయచంద్ర, శ్రీమతి జమున, అల్లాడి బాష్యకారులను కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకున్నారు.

### కల్కి భగవాన్ ?క్తుల సభ

మతాతీతంగా ధ్యా?ం ద్వారా భగవంతుని రూపాన్ని చ? వచ్చనే 'కల్కి భగవానుని' భక్తుల ?ఘం నెల్లూరులో పుట్టి సంవత్సరానికి పైగా అయ్యింది. కొత్త మార్గం కావడంతో భక్తులు కూడా ఎక్కువయ్యారని వార్షికోత్సవం సందర్భంగా వారు నిర్వహించిన ప్రదర్శన చాటి చెప్పింది. 6 తేదీ టౌన్‌హాల్‌లో జరిపిన సభలో సంస్థ జిల్లా ధర్మ గురువులు చివుకుల మాలకొండయ్య మాట్లాడారు. నేటి మానవులు సంవత్సరాల తరబడి పూజలు, వ్రతాలు చేస్తూ వాటి అర్థం కూడా తెలియక గ్రుడ్డిగా మొక్కుబడులు తీర్చుకోవడం వల్ల కాలం వృథా చేస్తున్నారు. సత్యలోక వాసులు మాత్రమే పొంద గలిగే సచ్చిదానందాన్ని ధ్యాన శిక్షణ ద్వారా పొంద వచ్చునన్నారాయన.

### ఆధ్యాత్మిక మూర్తిలా మారిన ఎస్.పి.

జిల్లా ఎస్.పి. శ్రీ ఎస్.వి. రమణమూర్తిలో కరుకైన 'ఖాకీ' వ్యక్తి వెనుక మరో ఆధ్యాత్మిక మూర్తి దాగున్నాడు. ఈ విషయం 12 తేది దర్గామిట్ట సుజాతమ్మ కాలనీలోని శ్రీ కృష్ణయోగ మందిరంలో వెల్లడైంది. శ్రీ ?ణపతి సచ్చిదానంద స్వామీజీ 52 వ జన్మ దినోత్సవ సభకు ముఖ్య అతి?గా విచ్చేసిన ఎస్.పి. శ్రీ రమ?మూర్తి మాట్లాడుతూ కొందరు భక్తి శ్రద్ధలతో దేవాలయాలకు వెళ్లి ఎంతో వినమ్రతతో భగవంతుని ఆరాధిస్తారు. అయితే లౌకిక జీవితంలో వారు తోటి మానవులతో వ్యవహరించే టప్పుడు ప్రేమ, దయ, మానవతా విలువలు విస్మరించి అహంభావంతో వ్యవహరిస్తుంటా రన్నారు. నానాటికి పతన మవుతున్న నైతిక విలువల పునరుద్ధరణకు గణపతి సచ్చిదానంద స్వామీజీ ప్రవచనాలను ?? చే ?కొని ఆచ?? దత్తానంద కమిటీ కార్యదర్శి కొండా బలరామిరెడ్డి మాట్లాడుతూ సచ్చిదానంద స్వామి రాగరాగిణీ నాద ప్రయోగ ప్రక్రియ మేళవించి వినూత్న ప్రయోగాల ద్వారా లక్షలాది మందిని సమ్మోహితులను చేసి ప్రజల్లో భక్తిని, ముక్తిని పెంపొందిస్తున్నట్లు చెప్పారు. సభలో శ్రీమతి విద్యుల్లత, జయలక్ష్మి, తిరుమలరావు తదితరులు పాల్గొన్నారు.

### 'స్వగృహం'

\- రసిక్

ఏ మాతామహుని ఇంటనో, ఏ ఆసుపత్రి వార్డులోనో పుట్టి
ఏ మూడోనెలో కన్నతండ్రి చూరుక్రిందకు వచ్చి చేరుకొని
విద్యార్జన నిమిత్తం ఊరుకాని ఊరులో దేశం కాని దేశంలో
ఏ హాస్టళ్ళలోనో, ఏ చుట్టాల ఇళ్లల్లోనో గడపి
ఉద్యోగ పర్వంలోపడి, వ్రాసి ఉన్న ఉద్యోగాన్ని చేపట్టి
బదలీలుండే ఊరూరూ తిరిగి తిరిగి
లేకుంటుబి, ఒకే వూరిలో వీధులు వీధులు మారి మారి
"ఓనరుల" నబడే వానరులను, భల్లూకాలను, తోడేళ్లను
ఓపికున్నంత వరకు ఓర్చుకొని, ఓర్చుకొని, ఓర్చుకొని
వెనుక వేసుకొన్న రెండు రాళ్ళతో ఎట్టకేలకు
ఓ చిన్న యిల్లు వంటిది కట్టుకొని లేదా కట్టించుకొని
'అమ్మయ్య! స్వంత ఇంటిలోకి చేరు కున్నా మిన్నాళ్ళకు
అని సంతసిస్తున్నావా? ఆగు.
అంతటితో కథ కంచికి చేరేనా?
నీ సొంత ఇంటిలోకి చేరింది నీ బాడుగ దేహమే కదా!
ఇలాంటి బాడుగ దేహాలింకా ఎన్నెన్ని ధరించాలో!
నత్తగానో, ఎలుకగానో, పిచికగానో మారి మారి
ఆయా బాడుగ శరీరాలకు సొంత ఇళ్లంటూ
గుల్లనూ, కలుగునూ, గూడునూ ఏర్పరచుకొని
ఇంకెన్ని మార్లు తాత్కాలిక సంతోషాలనుభవించాలో?!
బాడుగ దేహానికి సొంత ఇల్లంటూ ఏర్పడడంలో లేదు సుఖం
బాడుగ శరీరాలతో నిమిత్తం లేకుండా, లోని హంస
పరమాత్మునిలో లీనమవడంలో ఉన్నది బ్రహ్మానందం.
ఆనాడే స్వగృహానికి
అబ్బి! చేరుకొన్నట్లు లెక్క

### నెల్లూరు బజారు

మొలగొలుకులు

| | |
|---|---|
| 9672 | 3,500/ |
| 9674 | 3,800/ |
| ఐ.ఆర్. 64 | 3,900/ |

## పంచాంగము

### ఆర్ద్ర కార్తె

22 తేది బుధవారము ఆర్ద్రకార్తె ప్రారంభము.

### ముహూర్తములు

18 తేది శనివారము ఉదయం 8.21 గంటలకు వివాహములకు కర్కాటక లగ్నమున
రాత్రి 9.24 గంటలకు మకర లగ్నమున గృహ ప్రవేశ, వివాహములకు
19 తేది ఆదివారము ఉదయం 8.24 గంటలకు కర్కాటక లగ్నము ఉపనయన వివాహాది శుభకార్యములకు సుముహూర్తములు కలవు.

### జూన్ తిథులు

జ్యేష్ఠ శుద్ధ

తే 18 శని నవమి ఉ.గ. 7.12 ప
తరువాత దశమి 4.20 రా. గంట వరకు
తే 19 ఆది ఏకాదశి రా.గ. 2.24 వ
తే 20 సోమ ద్వాదశి రా.గ.11.52 వ
తే 21 మంగళ త్రయోదశి రా.గ. 9.29 వ
తే 22 బుధ చతుర్దశి రా.గ. 7.10 వ
తే 23 గురు పూర్ణిమ రా.గ. 6.00 వ
తే 24 శుక్ర పాడ్యమి రా.గ. 3.50 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

# ఛాన్సిస్తే మా కనక చెలరేగిపోతుంది!

అలనాటి నటి , దేవిక చాలామందికి ఇంకా గుర్తుండే వుంటుంది. ఈమె తెలుగు వారెవరైనా కనిపిస్తే "మా అమ్మాయి కనక ఏం పాపం చేసిందండీ ? నేను చాలా తెలుగు చిత్రాలలో నటించాను. రెండు మూడు చిత్రాలు నిర్మించాను కూడా. మా అమ్మాయికి మాతృభాష తెలుగు సినిమాలో నటించాలని ఆశ. అప్పుడొచ్చే, కొత్త నిర్మాతలు బొంబాయి తారలను బుక్ చేసుకోవడానికి ఉబలాట పడుతున్నారు. ఆ తారలు తక్కువ రేట్లుకు చేయరు కదా ? ఏదైనా ఒక సీన్ను బొంబాయి తార చేత, మా అమ్మాయి చేత చేయిస్తే, ఎవరు బాగా చేస్తారో తెలుస్తుంది. ఒక్కరు బుక్ చేసినా చాలు - మా పాప విజృంభించేస్తుంది." అంది. కనక ఇటీవల మధురై దగ్గర 40 ఎకరాల స్థలం కొన్నదట. అరవిలా పొరలతో ఉన్న ఆ ప్రాంతాన్ని చదును చేసి, కొబ్బరి తోట పెంచాలని ఉందట. ఎకరం 15 వేలు చొప్పున కొన్నదట." ముందు జాగ్రత్త కోసం ఈ పథకం" అంది కనక నవ్వుతూ.

## లతామంగేష్కర్ చిత్రం

ఎందుకో లతా మంగేష్కర్‌కు తమిళంలో ఒక చిత్రాన్ని నిర్మించే సంకల్పం కల్గింది. తన తండ్రి దీనానాథ్ కళామందిర్ పతాకంలో ఈ చిత్ర నిర్మాణం జరుగుతూంది. ఈమెకు శివాజీ గణేశన్ అంటే ఎంతో గౌరవం. ఈయన పెద్ద కుమారుడు రాంకుమార్‌కు చిత్ర నిర్మాణ బాధ్యత అప్పగించడం జరిగింది. ఈ సంస్థ తొలి చిత్రంలో కమలహాసన్ హీరో. తదుపరి చిత్రాలలో రజనీకాంత్, ప్రభు, శివాజీ గణేశన్‌లు నటిస్తారు.

# శోభన చేతికి బొబ్బలు ఎందుకెక్కాయి?

"చూశారా ! చేతులు బొబ్బలతో ఎంతగా ఎరుపెక్కాయో" అంది శోభన. కారణం అడిగేలోగా ఆమే చెప్పింది : 'ఉత్తమ నటిగా జాతీయ అవార్డు వచ్చినందుకు తిరువనంత పురంలోని గణపతి దేవాలయంలో వెయ్యిన్నొక్క కొబ్బరి కాయలు కొట్టాను." అంది. "ఒకటి ఎందుకు ? కొసరా? అని అడిగితే. "మలయాళ చిత్రంలో ఉత్తమ నటిగా కేరళ ప్రభుత్వం అవార్డు దక్కినందుకు ఆ ఒకటి. త్వరలో పెళ్లి చేసుకోబోతున్నాను కదా? ఆ తర్వాత సినిమాలలో ఎక్కడ నటిస్తాను? అందుకే ముందుగా విఘ్నేశ్వరుడికి కొబ్బరి కాయలు అర్పించాను." అందామె.

# తెలుగు నిర్మాతలకు పరిచయం చేయవద్దు!

" ఈ సువర్ణను తెలుగు నిర్మాతలకు మాత్రం పరిచయం చేయకండి," అని అందరితోనూ చెప్తున్నాడట ఓ మలయాళ నిర్మాత. 18 ఏళ్ల సువర్ణ 1993 లో తిరువనంత పురంలో జరిగిన అందాల పోటీలో 'మిస్ కేరళ ' గా ఎన్నికైంది. ఈమె నటించిన మలయాళ చిత్రం హిట్ అయింది. ప్రస్తుతం రెండు మలయాళ చిత్రాలు, కన్నడంలో ఒకటి ; "సీమ దొరై" అనే తమిళ చిత్రంలో నటిస్తోంది. "ఈ అమ్మాయిని పొరబాటునసైనా ఏ తెలుగువారికీ పరిచయం చేయకండి; చేస్తే - ఇక అంతే సంగతులు. తెలుగు నిర్మాతలు పోటీపడి ఈమె రేటును అమాంతంగా పెంచేస్తారు. దాంతో ఈమె మనకు అందకుండా పోతుంది," అంటున్నాడా మలయాళ నిర్మాత !

## అక్కినేని స్వర్ణోత్సవం

ఇటీవల మద్రాసులో భారీ ఎత్తున జరిగిన కార్యక్రమం "బంగారు కుటుంబం" శత దినోత్సవంతోపాటు అక్కినేని నాగేశ్వరరావు చలన చిత్ర స్వర్ణోత్సవం. ముఖ్య అతిథిగా విచ్చేసిన తమిళనాడు గవర్నర్ డాక్టర్ చెన్నారెడ్డి " నాగేశ్వరరావు విశిష్టమైన వ్యక్తి; నటుడు. ఆయన సాధించ వలసిన ఘన విజయాలు ఇంకా ఎన్నో వున్నాయి" అన్నారు. "పరదేశి - చిత్రంలో నాగేశ్వరరావు కొడుకుగా నేను నటించాను. " అంటూ అక్కినేని స్నేహశీలి అని ప్రస్తుతించారు గౌరవ అతిథి శివాజీ గణేశన్. "అక్కినేని గారికి నటన తపస్సులాంటిది. అందుకే ఇంత వయసొచ్చినా ఆయన ముఖంలో బడలిక కనిపించదు" అన్నారు ప్రత్యేక అతిథి -'కళాబంధు' టిక్కవరపు సుబ్బరామిరెడ్డి. "బంగారు కుటుంబం - శత దినోత్సవం తోపాటు మహానటుడు శ్రీ నాగేశ్వరరావు స్వర్ణోత్సవం జరపడం ముదావహం " అన్నారు సభాధ్యక్షులు డాక్టర్ సి.నారాయణ రెడ్డి. "యువతరంలో దేశభక్తి ప్రబోధించే చిత్రాల ఆవశ్యకత నేడు ఎంతో వుంది " అన్నారు రాష్ట్ర సినిమాటోగ్రఫీ మంత్రి డి.శ్రీనివాస్. " నేను విద్యార్థిగా ఉన్న రోజుల్లో మా కళాశాల వార్షికోత్సవానికి విచ్చేసిన నాగేశ్వరరావు గారిని చూసినప్పుడే నాకూ సినిమా నటుడవ్వాలనే తలంపు కల్గింది" అన్నారు హీరో కృష్ణ. "రాయితీలు ఎంతగా దుర్వినియోగ మవుతున్నాయో చాలామందికి తెలుసు. స్వార్థపరులు ఈ రాయితీలను తమ స్వార్థానికి వినియోగించు కుంటున్నారు. ప్రస్తుత . పరిస్థితులను సమీక్షించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది" అన్నారు దాసరి నారాయణరావు. ఈ కార్యక్రమాన్ని షావుకారు జానకి ప్రశంసనీయంగా నిర్వహించారు.

## ప్రీ పబ్లిసిటీ విషయంలో జాగరూకత

మణిరత్నం బాగా.

కొరవ 11 వ పేజీలో

### మంచికథ, పటువైన కథనం, నటుల నైపుణ్యాల మేళవింపు

# జీవితఖైదీ

**చిత్రసమీక్ష**
**గ్రిద్దలూరు గోపాలరావు**

అతనొక చైతన్య కెరటం; ఉద్యోగ నిర్వహణలో అతనొక వజ్రాయుధం; అసభ్య నాగరికతను చీల్చిచెండాడే చేవ అతనిలో వుంది. రాజకీయ దుర్గంధాన్ని, రౌడీయిజం ప్రళయాన్ని, స్వార్థపరుల దోపిడీ విధానాన్ని, రెండుసీతులను, రెండు వాల్కలను ఖండించెందుకు రుద్రుడై నర్తించే తాండవ కేళి అతనిలో వుంది. పైత్యాచారాలకు, అక్రమాలకు గురయ్యే జనం కన్నీళ్లు తుడిచి విషాదాన్ని తొలగించి చట్టరీత్యా రక్షణ కల్పించాలన్న ఆకాంక్ష అతనిలో వుంది. అందుకే అతని ఉద్యోగానికి, దోపిడీ వర్గానికి మధ్య ఎప్పుడూ యుద్ధమే! అతడ్ని బెదిరించినా, కసిరినా మాటిమాటికీ మారుమూల ప్రాంతాలకు విసిరి కొట్టినా విసుగెత్తక విరక్తి చెందక, సర్దుబాటు విధానం పాటించక, ఉద్యోగ ధర్మంలో న్యాయం కోసం ఆక్రోశిస్తూ, ఆవేశిస్తూ ఒంటరిగా నిరంతరం పోరాటం సాగించాడు. అందుకే అతని జీవిత విధానం బాధాకరం. కాని అతని జీవిత ధ్యేయం మాత్రం ఆదర్శవంతం. ఇంతటి ఖచ్చితమైన అధికారి, కె అజయ్ కుమార్ దర్శకత్వంలో రూపొందిన " జీవిత ఖైదీ" చిత్రంలో పోలీస్ ఇన్‌స్పెక్టర్ శ్రీరాం( శోభన్‌బాబు).

శ్రీరాం ఎంతటి పటుత్వమైన అధికారో అంతటి పవిత్ర ప్రేమికుడు. చట్టరీత్యా ఉద్యోగం నిర్వహించి నందుకు శ్రీరాంపైన అటు ప్రభుత్వము, ఇటు సంఘ విద్రోహ శక్తులు పగసాధిస్తారు. అలాగే తాను పవిత్రంగా ప్రేమించిన భార్గవిని(జయప్రద) తనకు దక్కకుండా చేశాయి సమాజంలోని స్వార్థపర శక్తులు. శ్రీరాం మేనత్త సుగుణ( [illegible] విజయ) తన కుమార్తె విశాలిని (జయసుధ) శ్రీరాం కిచ్చి పెళ్లి చెయ్యాలన్న స్వార్థ బుద్ధితో శ్రీరాంను భార్గవి నుంచి దూరం చేస్తుంది. శ్రీరాంను పెళ్ళి చేసుకున్న విశాలి మనస్ఫూర్తిగా శ్రీరాంను ప్రేమిస్తుంది. భార్గవి పట్టుదలతో ఐపిఎస్ పాసై ఎస్పి అవుతుంది. ఉద్యోగరీత్యా శ్రీరాంపై పగ సాధిస్తుంది. శ్రీరాం మూలంగా తన రౌడీ చర్యలు సాగని గరుడాద్రి(రామిరెడ్డి) శ్రీరాంను చంపేందుకు ప్రయత్నిస్తాడు. శ్రీరాం, యస్పి భార్గవి గరుడాద్రితో తలపడతారు. ఆ ఫైటింగుల హోరులో భార్గవి చనిపోతుంది. చనిపోయే ముందు శ్రీరాం ద్వారా తాను పొందిన బిడ్డను విశాలికి అప్పజెప్పి చనిపోతుంది.

గణేశ్ పాత్రో వ్రాసిన ముగ్గురు ప్రేమికుల ఇతి వృత్తంలో భిన్నత్వం వుండటం వల్ల కథ పట్టుగా కుదిరింది. శ్రీరాం, భార్గవి, విశాలి ఈ ముగ్గురు ప్రేమికుల పాత్రలను దర్శకుడు కట్టు దిట్టంగా నడిపారు. తనను మోసగించి శ్రీరాం విశాలిని పెళ్ళి చేసుకున్నాడన్న కోపం భార్గవిలో వుంది. శ్రీరాం విశాలి సుఖంగా వున్నారన్న అక్కసూ వుంది. శ్రీరాంను ప్రతీకార చర్యగా సూటిపోటి మాటలతో బాధిస్తూ వుంటుంది. అయినా ఒకప్పటి [illegible] కాబట్టి వారిద్దరిలో మమకారం ఏదో ఒక మూల

కొరవ 11 వ పేజీలో

# కావలి టౌన్ రోడ్లు ఎండల్లోనే గాలికి కొట్టుకపోతున్నాయి!

ఎక్కువ మొత్తం ఖర్చు పెట్టి తక్కువ కాలంలో నాశనమయ్యే రోడ్లు వేయడంలో మన కాంట్రాక్టర్లు, ఆర్ అండ్‌బి ఇంజనీర్లు కలసి సరిక్రొత్త ప్రమాణాలు సృష్టిస్తుంటారు.

అటువంటి విచిత్ర రోడ్ల జాబితాలో కావలి టౌన్ రోడ్లనూ చేర్చవచ్చు. గత సంవత్సరం నవంబరులో కురిసిన భారీ వర్షాలకు దెబ్బతిన్న కావలిపట్టణంలోని రోడ్లకు మరమ్మత్తుల పేరుతో ఆరు లక్షల రూపాయలు ఖర్చు చేశారు. వెంకటేశ్వర టాకీసు రోడ్డు, రైల్వే ఫీడర్స్ రోడ్డు, బంగ్లావీధి రోడ్డు, జనతాపేట, వైకుంఠపురం, పాత వూరుల్లో బాగా దెబ్బతిన్న రోడ్లపై ఈ మొత్తాన్ని ఖర్చు చేశారు. రోడ్లపై వున్న గుంటలు పూడ్చడానికి బండరాళ్లు, వాటిపై కంకర రాళ్లు వేసి, ఎర్రమట్టి చల్లి చుక్కనీరు కూడా చల్లకుండా రోలరు త్రిప్పి సరిపెట్టేశారు. ఇంత అధ్వాన్నంగా వేసిన రోడ్డు ఎంత తక్కువ కాలముంటుందో ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ఇప్పటికే పడమర గాలికి పైన చల్లిన ఎర్రమట్టి ఎటో వెళ్లిపోయింది. రెండు చినుకులు పడితే చాలు కంకర, బండరాళ్లు దర్శనమిచ్చేందుకు రెడీగా వున్నాయి. ఇప్పటికైనా వున్నతాధికారు లెవరైనా జోక్యం చేసుకుని ఈ రోడ్డుపైనే కొద్దో, గొప్పో మొత్తం ఖర్చు పెట్టి తారు రోడ్డు వేయిస్తే ఈ రోడ్డు రెండు, మూడేళ్లయినా వుంటుంది. లేకపోతే ఇప్పటికే పాపల భైరవుని చిట్టా వలె పెరిగి పోతున్న ఇంజనీర్లు, కాంట్రాక్టర్ల అవినీతికి బలైన రోడ్ల జాబితాలో ఇవీ చేరి పోతాయి.

## డక్కిలి ఆరోగ్య కేంద్రం స్థాయి పెంపు!

మండల కేంద్రమైన డక్కిలి లోని ప్రాథమిక ఆరోగ్య కేంద్ర స్థాయిని 30 పడకల ఆసుపత్రికి పెంచడానికి రాష్ట్ర మంత్రివర్గ సమావేశం ఆమోదం తెలిపిందని సర్పంచ్ పిల్లి పుల్లారెడ్డి చెప్పారు. మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్ధనరెడ్డి కృషి ఫలితంగా ప్రభుత్వం 15 లక్షల మేర ఖర్చుచేసి ఈ ఆరోగ్య కేంద్రం స్థాయిని పెంచింది. పంచాయితీ ఏర్పడింది మొదలు పుల్లారెడ్డే ఏకగ్రీవంగా సర్పంచ్‌గా ఎన్నికవుతూ డక్కిలి గ్రామాభి వృద్ధికి విస్తృతంగా శ్రమించారు. రాష్ట్రంలోనే ఆదర్శ పంచాయితీగా పేరుపొందిన ఈ గ్రామంలో కాలేజి లేని లోటు ఒకటుంది. దాన్ని కూడా తమ అధినాయకుడైన జనార్ధనరెడ్డి మంజూరు చేయిస్తాడన్న నమ్మకం డక్కిలి వాసుల కుంది.

## పోస్టుమాస్టర్‌కు వీడ్కోలు

అల్లూరు పోస్టుమాస్టర్‌గా గత నాలుగేళ్లు పనిచేసిన కె.వి.రత్నం బుచ్చిరెడ్డి పాళెంకు బదిలీ అయిన సందర్భాన్ని పురస్కరించుకొని 11 తేది వీడ్కోలు కార్యక్రమం జరిగింది. భట్రకాగొల్లు బ్రాంచ్ పోస్టుమాస్టర్ అధ్యక్షతన ఇన్‌ఛార్జ్ పోస్టుమాస్టర్ జిలానీ బేగ్ దుశ్శాలువతో కె.వి.రత్నంను సన్మానించారు. ఇ.డి. వుద్యోగులు, నేషనల్ సేవింగ్ సర్టిఫికేట్ ఏజంట్లు పోస్ట్ మాస్టర్ సేవలను ప్రస్తుతిస్తూ ప్రసంగించారు. పనిచేసిన నాలుగేళ్లు ఏ విమర్శ లేకుండా అందరికీ అందుబాటులో వున్న పోస్ట మాస్టర్‌గా మంచి పేరు తెచ్చుకొన్నారు.

## జులైలో దూదేకుల జిల్లా మహాసభ

నూర్ బాష (దూదేకుల) సంక్షేమ సంఘం జిల్లా కమిటీ సర్వ

**ఏ రోడ్డు చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం**

సభ్య సమావేశం రం[illegible]కుల పేటలో సంఘం జిల్లా అధ్యక్షుడు షేక్ కిలార్ సాహెబ్ అధ్యక్షతన జరిగింది. సమావేశంలో జూలై 10 తేదీ [illegible] మహాసభను జరపాలని తీర్మానించారు. అదే రోజు రంగనాయకుల పేట నుండి ర్యాలీ నిర్వహించి కలెక్టర్‌కు విజ్ఞాపన పత్రం [illegible] ప్రస్తారట. కార్యక్రమ నిర్వహణకు ఒక ప్రత్యేక కమిటీని కూడా ఎన్నుకొన్నట్లు కార్యదర్శి షేక్. మహబూబ్ బాషా తెలిపారు.

## ఉన్న బస్సులు వూడబెరికితే వప్పుకోరు!

అసలే కొత్తగా అధికారం చేపట్టారు. మరి 'తడాఖా' చూపించకుంటే బాగుండదని రాపూరు ఆర్టీసి డిపో మేనేజర్ తలపోసినట్లున్నారు. ట్రాఫిక్ ఇన్స్‌పెక్టర్‌తో కలసి పెనుబర్తి, ఏపూరు, సైదాదుపల్లి, గోనుపల్లి, వెలుగోడు, గుండవోలు గ్రామాల మీదుగా వెళ్లే బస్సు సర్వీసులు కొన్నింటిని రద్దుచేసి పారేశారు. వచ్చే కొద్ది బస్సులతోనే క్రిక్కిరిసిపోతూ, నరకం చవిచూస్తున్న ప్రయాణీకులు ఈ చర్యకు అట్టుడికి పోయారు. మామూలుగా చెబి[illegible] అధికారుల వినుకోరు కదా! 6 తేది రద్దుచేసిన సర్వీసులు మళ్లీ పునరుద్ధ[illegible]చమని బస్టాండ్‌లో సర్వీసుల న[illegible]ని స్తంభింప చేశారు. వున్నవి [illegible]క అల్లాడి పోతుంటే, ఏ [illegible]ధంగా మిగతావి రద్దు చేశారని ప్రశ్నిస్తే డిఎం సమాధానం చెప్పలేక మళ్లీ బస్సులను నడుపుతామని హామీ ఇవ్వడంతో ప్రజలు శాంతించారు. డిఎం గారు, బస్సులు రద్దు చేసే ముందు [illegible]న్ని విషయాలు పరిశీలించి తగిన చర్యలు తీసుకోండి.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

ప్రతిభా పిక్చర్స్ వార మూడో చిత్రంలో "కమలా కొట్నిస్" నటిస్తోంది. యీమె చాలా నాజూకుగా వుంటుందనన్నీ, పాట పాడగలదనిన్నీ, మాటలు ముద్దుగా పల్కక స్పష్టంగా ఉచ్చరించుననన్నీ. చెంచులక్ష్మిలో వలెగాక, శరీరం పూర్తిగా (పూర్తిగా అంటే యావత్తు అన్నమాట) వస్త్రములతో అచ్ఛాదితమునర్చు కొనునని దర్శకులు గ్యారంటీ యిస్తున్నారట.

* * *

[illegible]

పడనక్కరలేదు. 'అంబ' కోసం తగు వట్లాపుండగా [illegible] స్టూడియోలో [illegible] గోడవలతో

# రాపూరు ఘాట్ రోడ్డులో గట్టిగా తంతే కూలిపడే రక్షణ గోడలు కట్టారు!

మహా ఘనత వహించిన ఆర్‌అండ్‌బి అధికారుల లీలలు ఎంత చెప్పుకున్నా ఇంకా మిగిలే వుంటాయి. ప్రమాదాలకు నెలవైన రాపూరు-చిట్వేల్ ఘాట్ రోడ్డు ప్రక్కన నిర్మించిన సైడు గోడల కాంట్రాక్టులో మామూళ్లు తిని, చేసిన పనిని పరిశీలించక పోవడం వల్ల కట్టిన రెండో నెలలోనే కూలేందుకు సిద్ధంగా వున్నాయి. ఈ ఘాట్ రోడ్డులో తరచూ ప్రమాదాలు జరుగుతున్నందున సైడు గోడ నిర్మాణానికి కిలో మీటరుకు లక్ష రూపాయ ల చొప్పున ఆర్‌అండ్‌బి అధికారులు టెండర్లు పిలిచారు. రికార్డు స్థాయిలో ఇసుక కలిపి సిమెంట్ పైపైన చల్లి పని పూర్తి చేశారు. పని మొదలెట్టిన నాటి నుండి గోడలను ఏనాడూ నీళ్లలో తడిపిన పాపాన పోలేదు. అధికారులూ చూసీ చూడనట్లు వ్యవహరించారు. నాణ్యత లోపించిన గోడలపై పూసిన సిమెంట్ పెచ్చులు పెచ్చులుగా వూడిపోయింది. ఎవరైనా తాకితే చాలు కూలిపోయేందుకు సిద్ధంగా వుంది గోడ. ప్రజలను ప్రమాదాల నుండి రక్షించను కట్టిన నిర్మాణమే ఈ విధంగా తగలెడితే పట్టించుకొనే అధికారే లేడా? ఈ అవినీతి స్రవంతికి అడ్డుకట్టలేదా? కలెక్టర్ గారు తీరిక చేసుకొని ఒక సారి వెళ్లి ఆ పిట్టగోడ పని పరిశీలించి వచ్చి తగిన చర్య తీసుకోవాలి.

## అభివృద్ధి పథంలో మార్కెటింగ్ సొసైటీ

ఆత్మకూరు వ్యవసాయ మార్కెటింగ్ సొసైటీ అభివృద్ధి పథం వైపుకు పయనం సాగిస్తూంది. గతంలో ఈ మార్కెటింగ్ సొసైటీకి సెస్సు మూడు లక్ష రూపాయలే వసూలు అవుతుండేది. తాను ఛైర్మన్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించాక గత సంవత్సరం ఈ సొసైటీ సెస్సు వసూలు 8 లక్షలకు పెరిగినట్లు బి. పట్టాభిరామిరెడ్డిగారు చెప్పారు. జిల్లాలోని 11 సొసైటీలలో ఆత్మకూరు సొసైటీ ప్రస్తుతం ప్రథమ స్థానంలో వుందని; ఈ సంవత్సరం 10 లక్షల రూపాయల సెస్సు వసూలు లక్ష్యంగా పెట్టుకొనట్లు వివరించారాయన. 2.60 లక్షల రూపాయల వ్యయంతో ఆత్మకూరు మార్కెటింగ్ యార్డులో బావి, ఇంటర్నల్ రోడ్డు నిర్మాణాలు చేపట్టారట. ఈ సంవత్సరం 16.5 లక్షలతో యార్డుకు కాంపౌండ్‌వాల్, ఆఫీసుగది, రైతులకు వసతి గృహం, వాచ్‌మేన్ క్వార్టర్స్‌తో పాటు విద్యుత్ సౌకర్యం కూడా కల్పిస్తున్నట్లు పట్టాభిరామిరెడ్డి తెలిపారు.

**Before the Commissioner**
**Under Workmen's**
**Compensataion Act,**
(Assistant Commissioner of
Labour - II Circle, Guntur)
W.C. 32/93

Between:
పద్మనేని లక్ష్మయ్య - applicant
డి. మల్లిఖార్జున రావు. and
another opposite parites

To
డి. మల్లిఖార్జునరావు, S/o. పాపా రావు
లారీ ఓనరు నెం. AIK 1382
వాకలి వీధి, నెల్లూరు.

పై నంబరులోని అప్లికెంటు మీ యొక్క లారీ యాక్సిడెంటులో తగిలిన దెబ్బలకు గాను నష్టపరిహారం కోరుచు మీ మీద ఈ క్లెయిమ్ అప్లికేషన్ దాఖలు చేసి వున్నారు. కోర్టు వారు నీ ఆక్షేపణలు నిమిత్తం 20.6.94 తేదికి వాయిదా వేసినారు. వాయిదా రోజు మధ్యాహ్నం 3.00 గంటలకు కోర్టు వారి యెదుట హాజరయి నీ ఆక్షేపణలు ఏమయిన వున్న యెడల తెలుపు కోవలసినది. లేని యెడల నీ పరోక్షమందు విచారించి కేసు తీర్మానించ బడునని తెలుసు కోవలెను.

**ఆర్. సంజీవ రెడ్డి**
అప్లికెంటు తరఫు న్యాయవాది, గుంటూరు



**ఉత్తరక్రియలు**



మార్త కృష్ణారెడ్డి
[illegible]వీధి, నెల్లూరు.

మా తండ్రి

**మార్త కృష్ణారెడ్డి గారు**

5.6.94 తేది స్వర్గస్తులైనారు
వారి పెద్ద కర్మ
23.6.94 తేది గురువారం
ఉదయం నెల్లూరు బాలాజీ నగర్
(లక్ష్మీటోర్న సెంటరు)
లక్ష్మీనగర్‌లోని మా
స్వగృహమునందు జరుగును

ఇట్లు
కుమారులు

మార్త [illegible]కుమార్ రెడ్డి
మార్త పిచ్చిరెడ్డి
మార్త భాస్కర్ రెడ్డి
మార్త శివకుమార్ రెడ్డి

# చంద్రబాబు మామపై మండి పడుతున్నాడు!

సీనియర్ నాయకుల్ని విస్మరించారు. రాజకీయాలతో ఏమాత్రం సంబంధం లేని వారితో సలహా మండలిని నియమిస్తున్నారు. ఇందులో తెలుగుగంగ భూసేకరణ స్పెషల్ కలెక్టర్‌గా పనిచేసి రిటైర్ట్ అయిన వెంకట శివయ్యతో పాటు ఆంధ్రావర్సిటీ రీడర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, నగరంలోని ఒక కళాశాలలో లెక్చరర్‌గా వున్న

ఎన్టీఆర్ 2 పేజీ కొరవ

వెంకటేశ్వరరావు, లక్ష్మీపార్వతి సమీప బంధువు కొమ్మినేని శేషయ్య ప్రభృతులు వున్నారు. వీరంతా లక్ష్మీపార్వతి కనుసన్నల్లో మెలిగే వారే కావటం ఇక్కడ గమనార్హం.

## చంద్రబాబు 'పాక్షిక' విజయం

తెలుగు దేశం పార్టీలో అన్ని కమిటీలను రద్దుచేసి, రాజకీయేతరులతో ఏర్పాటు చేసే 'సలహామండలి' లో పార్టీ వ్యవహారాలను నడపాలని నిర్ణయించిన ఎన్టీఆర్‌ను నిలదీసి, చిన్నల్లుడు చంద్రబాబు నాయుడు 'పాక్షిక' విజయం సాధించ గలిగారు. అయితే పార్టీ అధ్యక్షుడే 'సుప్రీం' అన్న నినాదానికి భంగం కలగకుండా పార్టీ ఉపాధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి పదవుల్ని ఎన్టీఆర్ రద్దు చేశారు. అల్లుళ్ల కంటి నీరు తుడవటానికి అధ్యక్షుడి తర్వాత 'పార్టీ వ్యవహారాల్ని చూసేందుకు 'సమాలోచన మండలి'ని ఏర్పాటు చేశాడు. దీంట్లో అల్లుళ్ళిద్దరితో పాటు మరో ఏడుగురు సభ్యులున్నారు. ఈ కమిటీ కేవలం "సమాలోచనలు జరపటానికి మాత్రమే పరిమితం అవడాన్ని బట్టి ఎన్టీఆర్ మనసులోని ఆలోచనను అర్థం చేసుకోవచ్చు. పార్టీ అనుబంధ సంస్థల అధ్యక్షులు కూడా ఈ మండలిలో సభ్యులుగా వుంటారు. విస్తృతమైన ఈ మండలిలో 'అల్లుళ్లు' కూడా సాధారణ సభ్యులే కావటం గమనార్హం.

తెలుగు దేశం పార్టీ అంతర్గత రాజకీయాలు కుళ్లి గబ్బుకొడుతున్న దశలో ఏక పక్షంగా వ్యవహరించడం మంచిదికాదని చంద్రబాబు నాయుడు ఇటీవలనే ఎన్టీఆర్‌ను ఎడాపెడా వాయించారు. దాంతో మనసు మార్చుకున్న ఎన్టీఆర్ మొక్కుబడిగా కమిటీల్ని నియమించారు. అయితే తన 'సెక్రెటేరియట్' విషయంలో మాత్రం రాజీ పడక దాని నిర్మాణంలో తలమునకలై వున్నారు.

గుడ్డిలో మెల్లలాగా అల్లుళ్లు ఇంతటితో రాజీపడ్తారో లేదో వేచి చూడాల్సిందే.

## డైరీ కాదు .... చిత్రగుప్తుడి చిట్టా!

ఎన్టీఆర్ ఇప్పుడు ఓ పెద్ద సైజు డైరీ మెయిన్‌టెయిన్ చేస్తున్నారు. ఆ డైరీ పరమ రహస్యం. పరుల చేతిలో పడకుండా అతి భద్రంగా వుంచుకునే ఈ డైరీలో ఆయన వ్యక్తిగత విషయాలు అస్సలే వుండవు. పార్టీ ప్రముఖులు, ఎమ్మెల్యేలు, ఎంపీలు, కొత్తగా టిక్కెట్లు ఆశిస్తున్న ఛటమ్మల్ల జాతకాలు ఇందులో వుంటాయి. రాష్ట్ర వ్యాప్తంగా వున్న ప్రత్యేక వేగులు అందించే సమాచారం ఇందులో పొందుపరచ బడ్తుంది. దాన్ని బట్టి ఎన్టీఆర్ మార్కులు వేసుకొని అభ్యర్థుల మంచిచెడ్డల్ని అంచనా వేస్తుంటాడట. ముఖ్యంగా టిక్కెట్లు ఆశించే వారికి ఈ డైరీ చిత్రగుప్తుడి చిట్టాలాంటిది. గతంలో చంద్రబాబు నాయుడు పార్టీ చక్రం తిప్పేటప్పుడు 'తెలుగు' కంప్యూటర్‌ను వాడకంలో పెట్టి వివరాలు సేకరించేవారు. అయితే ఈ కంప్యూటర్ చంద్రబాబు మాట వింటోందని దాని నోటికి సీలు వేసి ఇప్పుడు డైరీకి పని కల్పించాడు.

జీవితఖైదీ 9 పేజీ కొరవ

కనిపిస్తూనే వుంటుంది. అలాగే శ్రీరాం, భార్గవుల ప్రేమాయణం తెలుసుకున్న విశాలి అసూయపు మాటలు, ప్రవర్తన చురుగ్గానే వుంటాయి. ఈ మూడు పాత్రల మానసిక స్వభావాలను చక్కగా చిత్రీకరించాడు దర్శకుడు. అందుకే మూడు పాత్రలూ ప్రేక్షకుల హృదయాలను ఆకట్టు కుంటాయి. అలనాటి మేటి తారలు శోభన్‌బాబు, జయసుధ, జయప్రదల మేళ వింపు ఈ మూడు పాత్రల విలువ పెంచింది.

సన్నివేశాలన్నీ పుష్టికరంగా అమరాయి. ఒక సన్నివేశంలో శ్రీరాం బదిలీ మీద ఆ ఊరొస్తాడు. భార్య విశాలిని, సామాన్లను ఇంట్లో దించి వెంటనే ఏదో కేసు విచారణకు వెళ్లి రాత్రి ఇంటికి తిరిగొస్తాడు. విశాలి సామాన్లు ఇంట్లో సర్దకుండా, అలాగే కూర్చుని వుంటుంది. సామాన్లు సర్దలేదేమిటని శ్రీరాం అడగ్గానే మీరు ఏదో కేసు విచారణకు వెళ్లారు కదా, అక్కడ మినిస్టరు కొడుకునో, ఎంఎల్ఏ తమ్ముడినో చావబాది వుంటారు. వెంటనే మనకు ఇక్కడి నుంచి బదలీ వస్తుందని సామాన్లు విప్పటం, మళ్లీ కట్టటం ఎందుకని సర్ద లేదంటుంది. ఈ మాటలు పెదవి విప్పని నవ్వుతో ప్రేక్షకులను ఆనంద పరుస్తాయి. విశాలి, శ్రీరాంల మధ్య మరికొన్ని సన్నివేశాల్లో ఇలాంటి సున్నిత హాస్యం దొర్లుతుంది. ఈ హాస్యం బాబూ మోహన్ లాంటి హాస్యగాళ్ల హాస్యం కంటే ఎంతో బాగుంది.

పాటల్లో రాజ్-కోటి పాతకాలపు బాణీలు కమ్మగా వినిపించారు. లోక్ సింగ్ ఫొటో గ్రఫీ బాగుంది. చిత్రం మొత్తం దర్శకుని ప్రతిభకు ప్రతీకగా నిలిచి జన రంజకంగా వుంది.

సినిమా 9 పేజీ కొరవ

ఆలోచించనిదే ఏ నిర్ణయమూ తీసుకోడు. ఈయన తాజా చిత్రం 'బాంబే' గురించి అట్టే వివరాలు తెలియజేయడం లేదు. కారణ మడిగితే, "ఇప్పుడే ఏం తొందర ? ఏ చిత్రం గురించైనా ముందు నుంచే గోరంతలు కొండంతలు చేసి ప్రజలకు తెలియ చేయడంవల్ల ఒక్కోసారి ఫలితం మరోలా వుండొచ్చు. నా 'తిరుడా తిరుడా' (దొంగ. దొంగ) విషయంలో అంతే జరిగింది. పత్రికల్లో వచ్చే వార్తలు చదివి ప్రేక్షకులు ఎక్స్‌పెక్టేషన్ పెంచుకున్నారు. పిక్చర్ చూశాక తాము పెంచుకున్న అంచనాలకు తగ్గట్టు లేదని నిరుత్సాహం చెందారు. వసూళ్ల విషయంలో బెడిసి కొట్టింది. ఆ పొరబాటు తిరిగి జరక్కుండా 'బాంబే' చిత్రం విషయంలో ముందునుంచే చాలా జాగ్రత్త పడుతున్నాను." అన్నారు. తెలుగు చిత్ర దర్శక నిర్మాతలు కూడా ఈ విషయాన్ని గుర్తించడం మంచిది.

## నాడు రష్దీ-నేడు నస్రీన్

-జయంపు కృష్ణ

మతం చెప్పేది ఏమిటి?
హితం పలికేది ఏమిటి?
మానవత్వం దైవత్వమనీ
మంచిని పెంచమని, పంచమనీ
మానవుడే మహనీయుడనీ
మానవ సేవే మాధవ సేవనీ-
మరి,
'శటానిక్ వర్సెస్' కు సాల్మన్ రష్దీనీ
'లజ్జ' నవలకు తస్లిమానస్రీన్‌కు
మరణ శిక్ష మహాదారుణం కాదా?
భావా వికాసానికీ, నవ కళానికీ అడ్డుకాదా-
అరాన్‌లో రచయిత ఆటిదిప్తి?
కవి సయీద్ సుల్తాన్‌పూర్-
బంగ్లాదేశ్ కవి దావూద్ హైదర్-
నోబెల్ సాహిత్య బహుమతి గ్రహీత
ఈజిప్టు కవి నగుయిబిమ్ ఫాట్-
ఇలా వల వేసుకుంటూ పోతే
ఇలలో సాహిత్యం వెలవెల-
ఆధునిక సమాజంలో అడుగు పెట్టాం
నవనాగరికత జీవనం సాగిస్తున్నాం
అసాధ్యాలను సుసాధ్యాలు చేస్తున్నాం
అసాధారణ ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శిస్తున్నాం
మరి మనిషి ఎందుకింత మరుగుజ్జు?
మనసు ఎందు కింత ముజ్జు ముజ్జు??-
సభ్య సమాజంలో ఛాందస వాదం
వసుదైక కుటుంబంలో మత మౌఢ్యం
ఆచారాల ముసుగులో మేధావుల ఖననం
తిరోగమనమా? మనది పురోగమనమా?
పునరాలోచన పుచ్చు అంటారా?
ముఖం కడుక్కోవడం నచ్చదంటారా?
మగువ తెగబడ కూడ దంటారా?
చదువు, సమానత, స్వేచ్ఛ వద్దంటారా?
దేవుడంటూ వుంటే దీన్ని హర్షిస్తాడా?
ఈ మనుషులందరినీ మార్చ కుంటాడా?
మానవ హితం కోరేదే మంచి మతం
ప్రజల శ్రేయస్సే మనకు సమ్మతం.

(రచయిత నస్రీన్‌ను హతమార్చిన వారికి లక్ష టాకాల బహుమతి - అన్న ప్రకటన చదివాక - రచయిత)

# జనవాణి

3వ పేజీ కొరవ

కారణం. శారీరక కారణాల మూలంగా యేర్పడే లైంగిక సమస్యలు చాలా అరుదు. ఏది ఏమైనా ప్రస్తుతం పరిష్కార మార్గాలు ఎన్నో వున్నాయి. అందువల్ల నపుంసకత్వం అనే భావనను విడనాడడం చాలా అవసరం.

- డా.ఇ.రాజగోపాల్‌రెడ్డి

నెల్లూరు

## రైతుపై మళ్లీ భారం

రైతులంటే ప్రభుత్వానికి మరీ చులకనై పోయింది. వ్యవసాయం చేయడమే కవాక కానాకష్టమై పోతున్నది. నత్రజని ఎరువులపై సబ్సిడీ ఎత్తివేసి యూరియా ధరను 20 శాతం పెంచి కేంద్ర ప్రభుత్వం రైతు నడుం విరగగొట్టింది. దేశంలోని రైతులు ఎక్కువగా నత్రజని ఎరువు వాడతారని ప్రభుత్వానికి తెలిసే ఈ పని చేసినట్లుంది. రైతే దేశానికి వెన్నెముక అని మీటింగుల్లో ఉపన్యాసాలు ఇవ్వడం కాదు. ఎరువులపై సబ్సిడీ కొనసాగించి యూరియా ధరను కంట్రోలులో వుంచి రైతులను ఆదుకోవలసిన బాధ్యత కేంద్ర ప్రభుత్వంపై వుంది.

నెల్లూరు - పి.మహీధర్‌రెడ్డి

## లారా ది గ్రేట్ !

అంతర్జాతీయ క్రికెట్‌లో అందనంత ఎత్తుకు చేరుకున్న యువ క్రికెటర్ బ్రియాన్ లారాకు జేజేలు. వెస్టిండీస్ జట్టులోని ఈ యువ ఆటగాడు అంతర్జాతీయ టెస్ట్ క్రికెట్‌లో 375 పరుగుల రికార్డును సాధించిన 50 రోజుల్లోనే మళ్లీ ఫస్ట్ క్లాస్ క్రికెట్‌లో 501 పరుగులు సాధించడం అత్యంత అరుదైన విషయం. లారాలోని క్రీడా స్ఫూర్తిని భారత క్రికెటర్లు కూడా అలవర్చుకొని అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవాలి.

మర్రిపాడు - పి.వి.శ్రీనివాసులు

## బెనజీర్‌కు ఎందుకో అంత బాధ !

పాకిస్తాన్ వైఖరి నానాటికి శృతి మించి పోతుంది. ఆ దేశం పుణ్యమే కాశ్మీర్‌లో నిత్య నరమేధం! ఒకప్పుడు మంచి నాయకురాలిగా పేరు గాంచిన ఆ దేశ ప్రధాని బెనజీర్ భుట్టో ఇదివరకటిలా లేదు. నిత్యం మన దేశంపై దుమ్మెత్తి పోస్తుంటుంది. ఇటీవల ప్రయోగించిన క్షిపణి పృథ్వి విజయ వంతమైన నేపథ్యంలో బెనజీర్ కోపం తారాస్థాయికి చేరుతూంది. క్షిపణి పరీక్షల ద్వారా భారత్ పాకిస్తాన్‌ను కవ్విస్తుందని ప్రకటన చేశారామె. మరి ఆమె ఎఫ్ -16 తరహా విమానాల కోసం అమెరికాను దేబిరిస్తున్న దానిని ఏమనాలి. ఆ దేశం వద్ద నున్న అణుబాంబు విషయమై ఏం సమాధానం చెప్తారు? అయినా పాకిస్తాన్ [illegible] ధోరణిని మన నేతలు ఖండించడంలో కాస్త వెనుకబడి వుంటారు. ఈ పద్ధతి మార్చుకోవాలి.

ఓజిలి - ఆర్.వి.శేషయ్య

## రంగడి గుడికి మరమ్మత్తులు చేయాలి

రంగడి గుడి గాలిగోపురం మీదవున్న బొమ్మలకు తక్షణ మరమ్మత్తులు ఎంతైనా అవసరమున్నది. ఈ బొమ్మలు కొన్నింటికి తలలు పోయాయి. కాళ్లు, చేతులు లేనివి ఎన్నో వున్నాయి. వీటిని ఈ విధంగానే వదలివేస్తే పురాతన సంపద అంతరించే ప్రమాద మున్నది. ఇప్పుడున్న ట్రస్టుబోర్డు ఉత్సాహ వంతులతో నిండివున్నది. చేస్తున్న అభివృద్ధి కార్యక్రమాల్లో బొమ్మల మరమ్మత్తులు కూడా చేర్పించాలని మనవి.

నెల్లూరు - టి.వి.నారాయణ

## రోడ్డు వేయించండి

మునిసిపాలిటీ లోని 13 వ వార్డు వాసులు అనేక సమస్యలతో సతమత మవుతున్నారు. ఎన్నో ఏళ్ల క్రితం ఇక్కడి 3 వ మెయిన్ రోడ్డులో వందలాది కుటుంబాలు స్థిర నివాసాలు ఏర్పరచుకొని వున్నా ఇంతవరకు మునిసిపాలిటీ రోడ్డు వేయలేదు. ఎండాకాలంలోనే కాలు పెట్టలేని గతుకులు, మిట్టలతో నిండివుంది ఈ రోడ్డు. రోడ్డు నిర్మాణానికి మునిసిపల్ అధికారులు కొలతలు తీసుకొని మూడు నెలలు గడుస్తున్నా పని చేపట్టిన పాపాన పోలేదు. ప్రాథమిక అవసరమైన రోడ్డు నిర్మాణాన్ని అకనైనా మునిసిపల్ అధికారులు చేపట్టాలని మనవి.

నెల్లూరు - పి.అరుణమ్మ

## పివికి భంగపాటు !

చీఫ్ ఎలక్షన్ కమీషనర్ శ్రీ టి.ఎన్.శేషన్ అధికారాలు కత్తిరించడానికి ఉద్దేశించిన బిల్లును నాటకీయంగా పార్లమెంటులో ప్రభుత్వం ఉపసంహరించు కోవడం వాస్తవానికి ప్రధానికి భంగపాటే. పార్లమెంటులో ఈ బిల్లు ఆమోదానికి మూడింట రెండు వంతుల మెజార్టీ కోసం వివిధ పార్టీల మద్దతు కోసం వెళ్లి ప్రభుత్వం రిక్తహస్తాలతో తిరిగి వచ్చింది. దేశంలో బీటలు వారుతున్న ప్రజాస్వామ్య సౌధానికి మరమ్మత్తులు అవసరమే. కాని అవి సమగ్రంగా వుండాలే తప్ప సంకుచిత ధోరణితో వుండకూడదు. బిల్లు ఆమోదం కోసం పార్లమెంటు ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటు చేయడమే కాకుండా పార్టీ సభ్యులందరూ తప్పకుండా పార్లమెంటుకు హాజరై ఓటింగ్‌లో పాల్గొనాలని విప్ జారీ చేసిన కాంగ్రెస్ పార్టీకి ఉపసంహరణ తీరని భంగపాటు. ఇకమందైనా ప్రభుత్వం ఏకపక్ష నిర్ణయాలు తీసుకోదని భావిస్తాను.

నెల్లూరు - వి.గణేష్

## నియోజకవర్గ మంత్రులు

నెల్లూరు జిల్లా నుండి మంత్రివర్గంలో ఇద్దరు మంత్రులు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. పసల్ పెంచలయ్య ( గృహ నిర్మాణశాఖ మంత్రి). కలికి యానాదిరెడ్డి (దేవాదాయమంత్రి); కాని ఇరువురూ తాము జిల్లామంత్రులన్న సంగతి మర్చిపోయి, నియోజకవర్గ మంత్రులుగా మిగిలిపోయారు. ఒకరు హైదరాబాద్ టు నాయుడుపేట, సూళ్లూరుపేట, తద వయా చిట్టమూరు తరువాత ఫలో హైదరాబాద్. రెండోవారు కావలి టు హైదరాబాద్‌లకే పరిమితమయ్యారు. విశ్రాంతి అవసరమైతే మాత్రం నెల్లూరు సోమశిల గెస్టుహౌస్‌కు చుట్టపు చూపుగా వచ్చి వెళతారు. జిల్లాలో ఏ నియోజకవర్గ అభివృద్ధి విషయమూ వీళ్లకు పట్టదు. వెనుకబడిన ప్రాంతాలు, సమస్యలు రానురాను ఎక్కువై పోతున్నాయి. మంత్రులుగా వున్నందజిల్లా మొత్తం అభివృద్ధిని పట్టించుకోవడం వారి ధర్మం.

కలిచేడు - షేక్ మహబూబ్ బాషా

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

S.C. No. 305/93

విజయబ్యాంకు, నెల్లూరు
Rep. by its. Manager -వాది

Vs

అరవ తేనమ్మ, W/o. రాయప్ప
అరవవీధి,జార్జిపేట, నెల్లూరు. -ప్రతివాది

### నోటీసు

వాది, పై నంబరు దావా బాకీ రాబట్టే నిమిత్తం మీ మీద దాఖలు చేసి యున్నందున మీరు 23.6.94 తేదిన ఉదయం 10 గంటలకు పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకొనని యెడల మీ పరోక్షమున దావా తీర్మానించ బడును.

వాయిదా 23.6.94 — పి. సమీర్‌బాబు, వాది తరపు న్యాయవాది

Between the Commissioner under Workmen's Compensation Act,
(Assistaaant Commissioner of Labour - II Circle, Guntur)
W.C. 31 /93

Between:
మద్దెల సుబ్బారావు -Applicant
And
డి. మల్లిఖార్జున రావు, and another Opposite parties

To
డి. మల్లిఖార్జున రావు
S/o. పాపారావు
లారీ ఓనరు, నెం. AIK 1382
చాకలి వీధి, నెల్లూరు.

పై నంబరులోని అప్లికెంటు మీ యొక్క లారీ యాక్సిడెంటులో తగిలిన దెబ్బలకు గాను నష్టపరిహారం కోరుచూ మీ మీద ఈ క్లయిమ్ అప్లికేషను దాఖలు చేసినారు. కోర్టు వారు [illegible] ఆక్షేపణలు నిమిత్తం 20.6.94 తేదికి వాయిదా వేసినారు. వాయిదా రోజు మధ్యాహ్నం 3.00 గంటలకు కోర్టు వారి ఎదుట హాజరయి నీ ఆక్షేపణలు ఏమయినా వున్న యెడల తెలుపు కోవలసినది. లేని యెడల నీ పరోక్షమందే విచారి[illegible] తీర్మానించ బడును [illegible]

ఆర్. సంజీవ రెడ్డి

[illegible]